ఫోన్: 2066
సంపుటి 5

టెలిగ్రామ్: హిందీసంఘ్
సంచిక 12

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

మార్చి, 1959

సంపాదకులు
వేమూరి ఆంజనేయశర్మ
సి. నారాయణరెడ్డి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
6-2-959, ఖైరతాబాదు — హైద్రాబాదు-4.

సంవత్సర చందా
రు. 3-0-0

విడిప్రతి
రు. 0-4-0

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో



★

సంపాదకీయం :

# నగరంలో నాటకశాల

కొన్ని సంవత్సరాలనుండి ఆంధ్రదేశం నలుమూలలా అమితోత్సాహంతో నాటికలు, నాటకాలూ ప్రదర్శింపబడుతున్నవి. ప్రతి పట్టణంలో ఔత్సాహికనటులు సమాజాలుగా ఏర్పడి వివిధ సందర్భాలలో తమ నటనాకౌశలాన్ని ప్రదర్శిస్తున్నారు. కళాశాలలు, ఉన్నత పాఠశాలల విద్యార్థులు నాటక ప్రదర్శనలో అపూర్వమైన అభినివేశాన్ని చూపుతున్నారు. ఆంధ్ర నాటకకళాపరిషత్తు, రాఘవనాటకకళాపరిషత్తు (విజయనగరం) వంటి అనేక సంస్థలు ప్రతి యేటా నాటకాల పోటీలు నిర్వహించి యువజనుల కళాభిరుచికి దోహదం కూరుస్తున్నాయి. వెనక వృత్తినాటకాలకున్న ప్రాధాన్యం క్రమేపీ ఔత్సాహికనటులు ప్రదర్శించే నాటకాలకేర్పడుతున్నదని అనవచ్చును.

అయితే వెల్లువలా క్రమశః విజృంభిస్తున్న ఈ కళాచైతన్యం తగిన నాటకశాలలూ, రంగస్థలాలూ లేకపోవడంవల్ల క్రుంగిపోవడంకూడా జరుగుతున్నది. ప్రదర్శనకు తగిన అవకాశాలు లేకపోవడంతో అటు నాటక రచయితలు, ఇటు ప్రయోక్తలు నిరుత్సాహ పడుతున్నారు. చిరకాలంనుండి ఈ కొరత తీరని సమస్యగా ఉండిపోయింది.

ఇటీవలే ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, శ్రీ బి. ఎన్. రెడ్డిగారి వంటి ప్రముఖుల కృషివల్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైద్రాబాదు నగరంలో ఒక నాటకశాలను నిర్మించడానికి సంకల్పించింది. ఇందు నిమిత్తం కొత్త బడ్జెటులో కొంత డబ్బుగూడా కేటాయించినట్టు తెలుస్తున్నది. ఇది ఔత్సాహిక నటులకు, కళాభిమానులకు హృదయపర్వమైన

విషయం. ఈ నాటకశాల కళామూల్యాలు కొరవడకుండా, ఆధునిక సామాజికుల అవసరాలకు, అభిరుచులకు తగినట్టుగా నిర్మింపబడుతుందని ఆశిస్తున్నాము.

నగరంలోనే కాక ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్యపట్టణా లన్నిటిలో ఇలాంటి నాటకశాలలు నిర్మింపవలసి ఉన్నది. ఆ యా పట్టణాల పురపాలక సంఘాలు సంకల్పిస్తే ఒకటి రెండు సంవత్సరాల్లో ప్రతి పట్టణంలో ఒక నాటకశాల వెలసి తీరుతుంది. సాంఘికజీవనంలో నాటకకళ కున్న స్థానాన్ని గుర్తించి, ఈ నాటికైనా నగరంలో నాటకశాలను నిర్మించడానికి పూనుకున్న ఆంధ్ర ప్రభుత్వాన్ని మేము ఎంతగానో అభినందిస్తున్నాము.



# ఆత్మీయము

—శ్రీ సి. నారాయణరెడ్డి

నేనొక్క అణువునే కాని దైత్య ప్రకృతు
లకు మేరుపర్వత శిరశ్శిఖరమైనాను
నేను ధూళికణమ్మనే కాని రసవదా
త్మలకు స్నేహతరంగిత కరండమైనాను.

నను నేను తెలిసికొంటిని అంతియే కాదు
నాచుట్టు ఎన్ని పరిణాహ వ్రతాక్షర మ
నీషానిధుల్ గలవొ నే తెలిసికొన్నాడ
నాకు తెలియనిది ద్వేషాకృతి యదొక్కటే.

ఒక అనామకుడు నా వికచకీర్తి ప్రౌఢ
కౌముదులలో కళంకము నద్దగాలేడు
ముకుళితాంతశ్చక్షు వొకడు నా వర్ధమా
న ప్రతిభ కెట్టి బందాలు వేయగలేడు.

కొకిబికి తలంపులకు కొక్కెర జపమ్ములకు
మడతమాటలకు కసుమాలంపు చేష్టలకు
అలవాటుపడ్డ జీవుల కొందరిని జూచి
ఒక్క పొడినవ్వుతో ఊరకుందును నేను.

నన్ను సన్మానించినారు కొందరు వెర్రి
వారు; వెన్నెల విరియగా రివ్వుమని యెగిసి
పోవునట్టి చకోరములకు తోబుట్టువులు
వారి వెర్రి రసైకధారాప్రణీతమ్ము.

నను చిరంజీవి యన్నారు కొందరు పెద్ద
వారు; నాకు సనత్కుమార తేజ స్స్పహా
ప్రాంశ మబ్బిన జాలునంచు నెంచినవారు
వారి వాగ్రీతి ఆశీరమృతరమ్యమ్ము.

వ్యాసము :

# మహాకవి బిహారి

—శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

కవితకు జీవము పోయునది వ్యంగ్యము. వ్యంగ్య ప్రధానమైన కవితను అందరు చెప్పలేరు. అంద రనగా సామాన్య కవులని భావము. కల్పనా సామర్థ్యముగల కవిమానస మెప్పుడును భావనా ప్రపంచమున సంచరించు చుండును. అతడు సర్వసామాన్యమగు వస్తువును గూర్చి చెప్పినను, అది అందము గానే కనబడును, అందులో ఏదో మధురభావము నిక్షిప్తమై ఉన్నట్లే తెలియ చ్చును. నిజమున కీ మధురభావమే పాఠకుని మనస్సును గిలిగింతలు పెట్టునది అప్పు డతడు ఆలోచనలో పడును. తత్ఫలితముగా అమృత తుల్యమైన చక్కని భావ మతనికి గోచరించును, కవిత ఆలోచనామృత మనిగదా మన పెద్దలు వచించిరి.

మధుర మనోహర భావమును తగుపాటి హాస్యరసముతో రంగరించినపుడు అది మెరుగుపెట్టిన బంగార మగును. వ్యంగ్యములో భావమున కున్నంత ప్రాధాన్యము హాస్యమునకు కూడ కలదు. వీనిని సమన్వయించుటలో కవి అప్రమత్తుడై యుండవలెను. లేదేని వ్యంగ్యము అపహాస్యముగా తేలిపోవును. హాస్య రసపోషణమే చాల కష్టము. అందును వ్యంగ్య పోషణము మరింత బాధ్యతతో కూడినది. విద్యానాథుని మతములో వ్యంగ్య వైభవమే కవితా కన్యకు జీవితము.

ఈ ముచ్చటను వినుడు.

ఆమె సౌందర్యవతి. వయసున చిన్నది. అత్తవారింటికి వచ్చిన క్రొత్త కోడలు. ఆమె మామగారు వట్టి పిసినారి. ధనవ్యయము అతనికి గిట్టదు. ప్రాణము పోయినట్లనిపించును. ఏదో పండుగ వచ్చినది. సంక్రాంతి అను కొందము. ధనికుడు గదా అని పలువురు బిచ్చగాండ్రు అతని యిల్లు చుట్టు ముట్టిరి. వారిని చూచుటయే తడవుగా అతనికి ప్రాణముపోయినట్లే తోచెను.

అప్పు డతడు ఒక యుక్తి పన్నెను. చిన్నకోడలు జ్ఞప్తికి వచ్చెను. ఆమె చిట్టిచేతుల చిన్నది. ఆమె చేతులతో బిచ్చము పెట్టిన బియ్యము కొంచెముగానే పడును.

మామగారి ఆజ్ఞ ప్రకారము ఆ చిన్నది బిచ్చము పెట్టుటకై వాకిట నిలిచెను. అప్పటి కప్పుడే యీ విషయము ఊరి నలుమూలలకు ప్రాకిపోయెను. బిచ్చగాండ్ర సంఖ్య ఎక్కువైనది. ఎవరీ క్రొత్త బిచ్చగాండ్రు? ఊరిలోని కోడెగాండ్రే బిచ్చగాండ్రయినారు. పాపము. బిచ్చము పెట్టునప్పుడైనను ఆమె సౌందర్యము గ్రోలవచ్చునను తలంపుతో సిగ్గు బిడియములను కూడ విడిచి ఊరి కోడెగాండ్రు భైక్షుక వృత్తికి దిగిరి.

"వ్యయము తగ్గించుకొన, లోభియైన మామ
చిట్టిచేతుల బిచ్చమ్ము పెట్టు మనుచు
కోడలిన్ నిల్పఁ, బురిలోని కోడెగాండ్రు
బిచ్చగాండ్రౌచు మూగిరి బిచ్చమునకు" —('విరివాన' నుండి)

రుచికరమైన మరియొక గాథను పరికింపుడు.

ఆ భార్యాభర్త లిరువురు ప్రేమైక జీవులు. ఒకరిని విడిచి మరియొకరు మనలేరు. అంత గాఢమైన ప్రేమపాశముచే వారి హృదయములు కట్టువడి యుండెను.

అది పుష్యమాసము. చలికాలము. ఢిల్లీ ప్రాంతమున మరింత చలి. ఆ చలికి ఒడలు మొద్దుబారిపోవును. భర్త పొరుగూరికి పోవలసివచ్చెను. అట్టితరి ఆమె అతనిని విడిచి ఉండగలదా? పైగా ప్రయాణము కూడ స్థిరమయ్యెను. తెల్లవారుజామున లేచి పొరుగూరికి పోవలెనని అతడు కృతనిశ్చయుడయ్యెను.

ఆమెకు సంగీతమున ప్రవేశముకలదు. వైణికురాలు. ఆమె యెప్పుడో విన్నది. మేఘమల్హారిరాగమును కనుక ఆలపించినచో మేఘములు వర్షించునని ఆ సంగతి ఆమెకు జ్ఞప్తికివచ్చెను. వర్షము వచ్చిన, అతడు ప్రయాణముచేయడు వర్షహేతు వగపడిచచో, ప్రయాణము తలపెట్టకూడదని పెద్దలు చెప్పుదురు.

ఇంకను తెల్లవారలేదు. ఆమె నిద్రనుండి మేల్కొనెను. వీణను సరిచేసెను. వీణపై మేఘమల్హారిని ఆలపించెను. భర్త కూడ రసికుడే. వర్షము కురిసెనో లేదో తెలియదు. రసికుడగుటచే అతడు ఆమెయభిప్రాయమును తెలిసికొనెను. అతడు మాత్రము అట్టి సరసురాలిని వీడి పొరుగూరికి పోవునా? ఆమె మనోరథము నెరవేరినది.

అరసికవలె ఆమె ప్రవర్తింపలేదు. పోవలదని మగని కాళ్లావేళ్లాపడలేదు. కన్నులలో వాన కురియించలేదు. సూదిపోటు మాటలనలేదు.

ఆ ప్రేమైక జీవుల విధానము, మేఘమల్హారిరాగ ప్రభావము, జ్యోతిష శాస్త్రమునందిసి వారి నమ్మకము మొదలగు విషయములను కవి ఎంత అందముగా చెప్పెను!

"పుష్యమాసాన నొకనాటి ప్రొద్దున విభు
డూరికిన్ బోవునని విని యువిద లేచి
వీణగొని గాన విద్యా ప్రవీణయగుట
ఆలపించెను 'మేఘమల్హారి' బిరాన—"

('విరివాన'నుండి)

పై రెండు దృశ్యములను చిత్రించినవాడు హిందీ మహాకవులలో ఒకడగు బిహారిలాల్ బిహారి.

హిందీ సాహిత్యమును సుసంపన్నము చేసిన కవిరాజులలో బిహారి పేర్కొనదగినవాడు. తులసీదాసువలె రామచరితమానసమువంటి రసవత్కావ్యమును అతడు రచించలేదు. కబీరువలె ఆధ్యాత్మిక వచనావళిని చెప్పలేదు. అసలు బిహారి రచన చేయవలెనను తలంపుతో కలము పట్టి రచన చేయలేదు. అయినను మహాకవుల పంక్తిలో అతనికి కూడ తావు చిక్కినది.

బిహారి చాటురూపమున కమ్మని కవితలు వెలయించెను. అతడు అప్పుడప్పుడు చెప్పిన దోహాలను (రెండు పాదముల పద్యము) తరువాతి వారు సంకలించి ఒక గ్రంథము తయారుచేసిరి. ప్రచురితమైన గ్రంథములో 726 దోహాలు గలవు. అయినను గ్రంథమునకు 'బిహారీ సత్‌సఈ' (సప్తశతి) అను ప్రసిద్ధనామ మేర్పడెను. ఈ ఒక్క రచనయే బిహారికి చిరయశస్సు సమకూర్చి పెట్టినది; మహాకవిగా పట్టాభిషేక మహోత్సవము చేసినది.

బిహారి ఆలంకారికుడు, కవి. రీతి కవులలో ఒకడుగా గణింపబడుచున్నాడు. చింతామణి త్రిపాఠి, రాజా యశ్వంతసింగ్, బిహారి, భూషణ్ మున్నగువారు రీతికవులలో ప్రముఖులని హిందీ వాఙ్మయ విమర్శకుల విశ్వాసము. కొందరు బిహారీని సూరదాసు తులసీదాసులకు తరువాత పేర్కొనదగిన కవిగా వర్ణించినారు. కాని యీ విషయమున విమర్శకులలో అభిప్రాయ భేదములు గలవు.

క్రీ. శ, 1603 వ సం॥ ప్రాంతమున గ్వాలియరుకు సమీపస్థమగు ఒక గ్రామమున బ్రాహ్మణ కుటుంబమున బిహారి జన్మించెను. అతని బాల్యము బుందేలుఖండమున గడచెను. చిన్నతనముననే ఒక యింటివాడయినట్లు

తెలియుచున్నది. అతని యౌవనము మధురలో మామగారి యింట గడచెను. ఇంతవరకు బిహారి జీవితమున చెప్పదగిన విశేషము లేమియులేవు. జయపూర్ పరిపాలకుడగు జయసింహుని ఆదరాభిమానములు లభించుటతో బిహారీ జీవితమున నూతనాధ్యాయము ప్రారంభమయ్యెను. జయసింహుని ఆదరణ మునసే బిహారి కవిత చెప్పదొడగెను.

జయసింహుడు భోగలాలసుడు. చిన్నరాణియందు అతడు ఎక్కువ మక్కువ కలిగియుండెను. రాచకార్యములను కూడ మానివైచి అత డామెతోనే ఎల్ల ప్రొద్దులు గడపుచుండెను. ఆమెయే అతనికి సర్వస్వము. ఇది పెద్ద రాణికే కాక మంత్రులకును బాధగా తోచెను. అట్టి సమయమున బిహారి జయసింహుని కొలువుకూటము చేరెను. చిన్నరాణితోనే కాలము బుచ్చుచుండిన రాజు నుద్దేశించి బిహారి యీ క్రింది పద్యమును వ్రాసి దానిని రాజున కంపజేసెను.

"పుప్పొడి హుళక్కి, పూదేనె మొదలె కల్ల,
పూర్ణ వికసన మంతకుమున్నె సున్న,
ఇట్టితరి మొగ్గకే వెట్టు కట్టువడితి!
తేటి! నీ గతి ముందెట్లు తెల్లవారు?

('విరిసాన' నుండి)

ఇందలి వ్యంగ్యము రమ్యాతిరమ్యము!

అన్యాపదేశమున చెప్పబడిన యీ పద్యమును వినినంతనే రాజునకు జ్ఞానోదయ మయ్యెను. దానితోపాటు కవిపై అవ్యాజానురాగ మేర్పడెను. కాలక్రమమున ఆ అనురాగమే గౌరవముగా మారెను. పద్యమున కొక్క మొహరీ చొప్పున రాజు కవిచే పద్యములు చెప్పించుకొనెను.

జయసింహుడు మరల రాచకార్యములను పర్యవేక్షింప దొడగుటతో మంత్రులు సంతసించిరి. తత్ఫలితముగా బిహారీకవియెడల అందరకు అంతులేని ఆదరాభిమానములు కలిగెను.

1663 లో మహాకవి బిహారి స్వర్లోకము చేరెను.

బిహారీ దోహాలలో వ్రజభాష అందాలు దిద్దుకొనెనని విజ్ఞుల విశ్వాసము. వ్రజభాషయే కాక బుందేలుఖండీ కూడ బిహారి కవితలో తల దాచుకొన్నది.

'బిహారీసత్‌స ఈ ఆలంకారిక రచన. ప్రతి పద్యమునందును అలంకార మేదో యొకటి కనబడుచుండును. ఆలంకారిక రచన అయినను, ఇది పండి

తులయు, పామరులయు ఆదరమును చూరగొనినది. ఇందుకు కారణములు రెండు : మొదటిది. దోహాలలో ప్రయుక్తమైన భాష ఆనాటి ప్రజల భాష. ప్రజాభాష మహాకవి సుకుమార హస్తమున కావ్యభాషగా పరిణమించెను. రెండవది : దోహాలు శృంగారరస ప్రధానములు. కాని కొన్నిచోట్ల ఈ శృంగారము హద్దులు దాటినది, అయినను వ్యంగ్య వైభవము సంతరించుకొనిన కారణమున బిహారీదోహాలు సహృదయులకు రసగుళికలయినవి. శృంగారము అతిగా చెప్పబడిన పట్టులు మాత్రము సమర్థనీయములుకావు. ఏమయినను 'బిహారీ సత్ సఈ' కి హిందీ సారస్వతమున విశిష్టస్థానమే లభించినది.

బిహారీ రచనలోని మాధుర్యమునకు ముగ్ధులై శ్రీ చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు 'విరివాన' అను పేర దీనిని తెలుగు చేసిరి. విరివానలోని కొన్ని తేటగీతులను పరికింతము :

"పరుని యిల్లాలిఁ గవిసిన పాప మంచు
పలుకు పౌరాణికుని సూక్తి కలరి నవ్వ
నతని ముదిలంజె నవ్వులో వ్యంగ్య మరసి
ఆతడున్ నవ్వబోయి నవ్వాపికొనియె—"

ఇది పరిహాసమునకు ఉదాహరణముగా చెప్పబడినది. చతురోక్తి తార్కాణ మీ క్రింది పద్యము.

"షండు డగు వైద్యు డొకని మోసం బొనర్చి
ధనము గొని వీర్యవృద్ధికై తగిన యౌష
ధం బిదె యని యిడగ- తత్తరుణి నవ్వి
యనియె "మీ రేల సేవింప" రని ఛలోక్తి —"

ఆదివ్యౌషధమును మీ రేల సేవింపరాదు ? అని నపుంసకుడగు వైద్యుని యిల్లాలు మగనితో మేల మాడుటయే యిందలి చతురోక్తి.

ఇట్టివి కొల్లలు.

కొండంత భావమును రెండు పాదములలో కుదించి చెప్పిన బిహారి ప్రతిభకు జేజేలు.

మహాకవి బిహారి మధురభక్తి సంప్రదాయానుసారముగా కొన్ని చాటువులు వెలయించెను. రాధాకృష్ణుడు ఆయన అభిమాన దైవతము. రాధాకృష్ణులను ఆధారము చేసికొని బిహారి సాంసారిక జీవనము మనోజ్ఞముగా

చిత్రించెను. బహుశః రాధాకృష్ణుల శృంగార జీవితమే బిహారిని సౌందర్యోపాసకునిగా చేసియుండును. ఒకచోట బిహారి యిట్లు నుడివెను.

"పసిడి క్రొంబట్టు పుట్టంపు బసిమితోడ,
బొమముడులతోడ, చలిత నేత్రములతోడ,
నటన మొలికించు నొయ్యారి నడలతోడ
నామనము దోచికొనె నందనందనుండు."

కనుక బిహారి కృష్ణ భక్తుడగుట నిర్వివాదము. కృష్ణునివలె రాధ కూడ అతనికి ఆరాధ్య దైవమని విశదమగుచున్నది. 'బిహారీ సత్ సఈ' కి మంగళాచరణరూపమున నున్న యీ పద్యమును పరికింపుడు:

"శ్రీ విహారుండు మేఘశరీరు డయ్యు
నే యువతి మేనిపసిడి క్రొంజాయ సోకి
నంత హరితద్యుతి వహించె నట్టి జాణ
యైన రాధిక భవబాధ లడచు గాక!"

చాటురూపమున కాక కావ్యరూపమున బిహారి యేదేని రచన వెలయించి యున్నచో, ఆ మహాకవి ప్రతిభ యింకను తేటతెల్లమై యుండెడిది. ఏమయినను, బిహారి మహాకవిగా వార్త కెక్కినాడు!



కవిత :

# భావస్థిరాణి

-శ్రీ సుప్రసన్న

హైమాంశూజ్జ్వలముల్ పురా విదితముల్
ఆకాశలోలమ్ములై
శ్రీమందాకిని తుంపరల్ తడుపగా
శ్వేతాభ్రముల్ సాగెడిన్
ఈ మబ్బుల్ కదలాడు దారులను గు
ర్తే నాకు ఈ దారులం
దేమో నావను ఊహ పెంచుకొనినా
నేపూర్వసంస్కారమో ?

ఒక బుజమెక్కి పాము లొక
టొక్కటి గాలికి ప్రాకులాడునా
నొక సిగమీది వెన్నెలల
ఊటలు అడ్డముగా స్రవించునా
వికసిత చంపక ప్రసవ
వేణుల అచ్చర లెల్ల తాకి తా
కక కొసవ్రేళులం, పకప
కల్ మృదుహాసములన్ చలింత్రునా.

గుండెలు దాచుకొన్న పలు
కోనలలో అనురాగ మాధురుల్
పిండిన లేత వెన్నెలల
బీడులలో పెదవుల్ పెదాలు ఒం
డొండొకడైన ముద్దుతడి

లో నవమేఘ నభఃకవాటముల్
రెండు పగిల్చి వెల్వడి న
వేంద్రియభావము పుక్కిలింతలై.

మతిభారాపరివేగమోర్వగలనా
మానోజ్ఞసౌందర్య భా
వతురంగమ్ముల గిట్టలెప్పుడును నా
ఫాలమ్ముపై ముద్రవె
ట్ట తలంపుల్ కదలాడు నా హృదయ మం
టన్ వేడిరక్తాలు జృం
భితముల్ గుండెలు పట్టుకొంచు నిలతున్
బీభత్సభావంబునన్.

ప్రాణజ్యోత్స్నాభిషేక
మో నవమధురానుభూతి ఉన్నదో లేదో
నేనే ఒంటరిగా భా
ధానీతుడ నౌచు వెలుగుదారి వెదకెదన్.

ఎవని మనస్సులో కలుగు ఏ అనుభూతియు లోతు పొంద నం
తవరకు దూరదూరముగ దర్శితమయ్యేడు కాని, భావనా
ప్రవణ మనస్సమాధి పసివాడును, బ్రహ్మమహర్షికూడ ఊ
హవదలి శూన్యమో సుఖమొ అందుదు రాత్మనివిష్టచిత్తులై.

ఎన్నియుగాలు దాటినవి ఈ పసిగాలులు ఏ మహాకవీం
ద్రాన్నిలబెట్టి రాజసవిభూతిని సాత్త్వికనిష్ఠచేసెనో
ఎన్ని యుగాలు దాటినవి - ఈ పసివెన్నెల లాత్మనిష్ఠ చి
త్తోన్నతవీథిలో పరిమళోజ్జ్వలముల్ కపులాల్ జ్వలించెనో!

ఇది అనుమానహేతువున నేర్పడ ; డింద్రియముల్ స్పృశించు, నీ
మదియయినన్ చిగుర్పవలె – మన్మృదుఫాలమునందు అప్సర
స్సుదతుల వేలనోళ్ల లొకచోటనె ముద్దిడుకొన్నయట్టు లా
యదనున ఊహకందని మహానుభవమ్ములు పల్కు-టెట్టులో ?

తావి భరింపలేను-ఎదతాకిన ఈ మలయానిలమ్ములం
దీవి గ్రహింపలేను-ఎవడేనొక డాత్మ విదాహమూర్తి నీ
త్రోవకునడ్డమై ఎడదతో సకలమ్ము నొసంగి నిర్వికా
రావధి దాటిపోయినపు డాతని ఈవి భరించుకొందువా ?

కోరికలేని వేళలను కోరెడు శక్తియు చాలనట్టిచో
ఏరకమైన ఈహ మదినేర్పడనప్పుడు ఎవ్వడో జగ
ద్భారవహుండువోలె కనబడ్డపుడే ఎదచీల్చిగుండె మం
దారము లిచ్చిపోవు మమతాఫలధారవినష్టవృత్తియై.

ఎవని దాతృత్వమేని భరించునపుడు
చేత ఉద్గత మూహ స్పృశింపవలయు
లేనిచో నిల్వదంబుదాలి స్రవియించు
వారి గిరుల జారును సెలయేరులట్లు.

ఈసృష్టి మదభిముఖాసువుగా దోచు
వెన్నెల లిట్లు ద్రవించునేమి ?
ఈ యనంతాభ్రమాహేయీ మహోమూర్తి
పొదుగు కార్చన నిట్లు పొంగెనేమొ ?
ఈ ఎనిమిది దిక్కు- లెవ్వరో ముడివైచి
రన్నట్లు బాలశశాంకుడైన
వెలితిగాదోచు నవ్వీన శరద్రాత్రిలో
ఏనొక్క-డన నిదురింపలేదు

అనభిముఖమైన సృష్టిరహస్యమెరుగ
రాక సుప్తలోకమ్ముచికాకు నిద్ర
లో ఎవో ఇరుల్ దయ్యములుగ మనసున
ఏనొకడ మేలుకొనియుంటి నీ నిశీధి.

సౌందర్యంబుల కుప్పకొట్టినటులై సానంద వేదర్షి ఋ
జ్మందస్వానము లాక్రమించినటులై, మత్పూర్వ సాహస్ర జ
న్మాందూ పుణ్యసరోజముల్ విరిసినట్లై నీకనుల్ విచ్చుకొ
న్నం దానోహమనం డెవండు అటులౌనా నాదు జన్మానికిన్ ?

లేవో లోకములందు వెన్నెలలు ? తల్లీ నాంతరానంద భా
వావేశమ్మున నీవు తోచెదవు నాకన్నా ! భరింపంగలే
నీ విచ్ఛేదములేని ఊహసుడులం దేమౌదునో నేను, ఆ
నీ వేరూపములోన వచ్చినను కానీ నాకు ఆనందమే.

(ఆకాశవాణి సౌజన్యంతో)



# విశ్వనాథవారి నవలలు సమన్వయము కాని కొన్ని సమస్యలు

—నాగభూషణ్

[మహాకవులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్యాన్ని అధ్యయనం చేయడంకోసం అక్టోబరు 26, 27 తేదీలలో 'రసధుని' పక్షాన 'విశ్వనాథ సాహిత్య సమాలోచనము' ఏర్పాటు చేయబడినది. ఈ సమావేశాలలో శ్రీమద్రామాయణ కల్పవృక్షముపై శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ సంపత్కుమారగారు, లఘుకావ్యములపై శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు, నాటకములపై శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు, నవలలపై శ్రీ జువ్వాడి గౌతమరావుగారు, శ్రీ నాగభూషణ్‌గారు వ్యాసములను చదివినారు. ఈ వ్యాసములలో ఇది ఐదవవది.

—సంపాదకులు.]

ఈనా ఉపన్యాసానికి నేను ముందు ఉంచదలచుకొన్న శీర్షిక "విశ్వనాథ వారి నవలలు : పాశ్చాత్య ప్రభావము" అని. ఇప్పటి శీర్షిక "విశ్వనాథవారి నవలలు : సమన్వయము కాని కొన్ని సమస్యలు" అన్నది. మొదటి శీర్షికను ఎందుకు మార్చాపూ-అంటే, దేశంలో రెండు వందల యేండ్లుగా జీర్ణించుకొని పోయిన భాష, ఆ భాషలోని భావాలు విశ్వనాథయందు తత్రతత్ర కనిపిస్తుందీ అంటే అందులో విడ్డూరంలేదు. అట్లు కనిపించకపోవడం విడ్డూరం, రెండు శతాబ్దములపాటు మహమ్మదీయ పరిపాలనచే భ్రష్టమై, ఆ తరువాత శక్తిమంతమయిన ప్రభువులు లేకుండటచే దేశమునందెల్లయెడల అంధకారము వ్యాపించినది. ఆ అంధకారమును పోగొట్టి వెలుగు తెచ్చినది ఆంగ్లేయులు. ఆంగ్లేయ ప్రభావం లేకనే ఆ అంధకారాన్ని చీల్చుకొని వచ్చు శక్తిసామర్థ్యాలు విశ్వనాథ అనన్య తేజోమయ మూర్తికి వుండవచ్చును. ఉన్నా అంతటి శక్తిమంతుడు కూడా అ అంధకారంనుంచి వెలికిరావడానికి చేసే ప్రయత్నంలోనే తన శక్తిని వినియోగిస్తాడు కాని, చుట్టూవుండే అంధకారాన్ని రూపుమాపజాలడు. ఆ పాశ్చాత్య ప్రభావమే లేకపోతే విశ్వనాథ అమావాస్య రాత్రి గుడ్డి దీపమో, తీరములు కన్పించని ఎడారియందు ఓయసిస్సో, చెట్లు లేనిచోట ఆముదపుచెట్టో అగునుకాని దుర్నిరీక్ష్య తేజమైన ఆ వెలుగూ, ఆ సాగర గంభీ

రత్నము ...శాలత... ...దరో సేదతీరి, తప్పక
వృక్షమూ అయివుండవచ్చు.

కాగా, మనస్సు ... అన్నది పాశ్చాత్య సంపర్క జనితమైన ఒక నూతన ... ప్రక్రియ. భావంలో కాకపోతే శిల్పంలో అయినా దాని ప్రభావం వుండక తప్పదు కదా!

ఒక్క శిల్పములోనే కాదు. కథా విషయంలో కూడా విశ్వనాథ పాశ్చాత్యుల ఒరవడిలోనే పోయాడు. ఆయన నవలలో దాదాపు అన్నింటికీ ప్రేరకములైనవని చెప్పదగిన పాశ్చాత్యుల నవలలున్నవి. సంస్కృతాంధ్రలతో పాటు చిన్నతనంనుంచి చదివిన ఆంగ్ల భాషా ప్రభావం కూడా విశ్వనాథపై వున్నదని చెప్పడంలో ఆశ్చర్యములేదు,

ప్రతి నవలనూ తీసుకొని, దానికి ఆంగ్లమున కల సమాంతరాలను చూపడం యీ నా వుపన్యాసము యొక్క ఉద్దేశ్యం కాదు. ఎందువల్లనంటే విశ్వనాథ సాహిత్యాన్ని గురించి జరిగే యీ సమాలోచనంలో—ఆయనను కదిలించ కలిగినంతటి శక్తిమంతములే అయ్యు - పై కారణములవల్ల ఆ ప్రభావమును నేటి జాతి లక్షణముగనే చెప్పి—యీ వుపన్యాస విషయానికి వస్తాను.

విశ్వనాథ నవలలను స్థూలంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. ఒకటి నవలలైన నవలలు: రెండు నవలలు కాని నవలలు...మీరు ఆశ్చర్యపడవచ్చు...దానికి నా వ్యాఖ్యానంయిది:

శిల్పదృష్టిలోను, భావసమన్వయంలోనూ పరిపుష్టములైన నవలలు మొదటిజాతికి చెందినవి. ఏకవీర, మాబాబు, చెలియలికట్ట యిందు ముఖ్యమైనవి. నవలలనబడెడి వానికి సాధారణముగా వుండే నియమాలను అధిగమించి నడచిన నవలలు. రెండవజాతికి చెందినవి వేయిపడగలు, తెఱచిరాజు, స్వర్గానికి నిచ్చెనలు. అయితే ఈ రెండో జాతికి చెందిన నవలలను జనులు చదువరా? ఎందుకు చదువరు? చదువుతారు........కాని చదివిన తరువాత వానిని నవలలనుకొనరు. విశ్వనాథ తాను నమ్మిన సిద్ధాంతములను ప్రపంచించుటకు సాధనములుగా మాత్రమే వీనియందు ప్రయత్నించినట్లు కన్పించును. మరి వానిలో కూడా కథ, కథను నడిపించే పద్ధతి, శిల్పము—అన్నీ వున్నాయికదా అనవచ్చు. ఉన్నమాట నిజమే! అవిలేకుండా ఆరూపంలో ఒదిగి ఏ సాహిత్య ప్రక్రియా వుండలేదు. అయితే అవి వుండవలసిన విధంగా లేవని మాత్రమే నా అభిప్రాయం,

ఉండవలసిన విధం ఏది ? నవల అనేది ఒక సాహిత్య ప్రక్రియ - ఒక కావ్యమువలె; ఒక నాటకమువలె.... ...దానికికూడ నిర్ణీతమైన ఒక రూపం వున్నది. "నవల అనేది ఎలా వ్రాసినా ఫరవాలేదు. అది బాగా ప్రచారంలోకి వచ్చిన పాశ్చాత్య దేశాల్లోనే దానికి యింతవరకు కొన్ని నియమాలు అంటూ లేవు." అనే అభిప్రాయం దేశంలో కొందరు విమర్శకులనబడే వాళ్ళకు వున్నది. ఈ అభిప్రాయం విశృంఖలత్వాన్ని కోరేవారు చెప్పవలసిన మాట.

నియమరహితమైన ఏ ప్రక్రియను మనం కోరడంలేదు. కోరకూడదు. నియమాలనేవి ఏవో కొన్ని వుండక తప్పదు. నవల విషయంలో కూడా యింతే—దానికే కొన్ని ప్రత్యేకమైన పరిధులు వున్నాయి. అవికూడా ఒక నియమానికి ఒదగవలసిన అవసరం వున్నది. నాటకాన్ని చూపి నవల అనలేము కదా!

కథా సంవిధానంలోనూ, పాత్ర పోషణలోనూ, వాతావరణ నిర్మాణంలోనూ - ఆ నియమాలకు ఒదిగి—వినూత్నములయిన పోకడలు పోవచ్చును, ఆంగ్లరచయితలలో కూడ ఒక్కొక్కరు ఒక్కొక్క రకమైన శిల్పాన్ని స్వంతం చేసుకున్నారు. అలాగే విశ్వనాథ కూడా తాను పట్టిన ప్రతిదానిని బంగారం చెయ్యకలిగినా - ఆ బంగారాన్ని తనకు కావలసిన వస్తువుగా మలచుకోవడంలో జరిగిన హెచ్చుతగ్గులను గురించి విచారించడం నాపని.

సార్వజనీనమైన కథావస్తువును గ్రహించడం నవలా రచయిత మొదట చేయవలసిన పని. సార్వజనీనం ఎప్పుడు అవుతుంది ? ఎవరో కొందరు వ్యక్తులకు, ఒక వర్గంవారికి మాత్రమే ఆ నవల రుచించకూడదు. చదివిన ప్రతి స్త్రీ, పురుషులకు అది ఆనందదాయకం కావాలి.

తన కథావస్తువును సార్వజనీనం చెయ్యడానికి రచయిత ఎన్నో మార్గాలను అనుసరించవచ్చు. వాతావరణ కల్పన, పాత్ర పోషణ, సంభాషణా చాతురి...ఇవి అన్నీకూడా రచయిత వ్రాయదలచుకొన్న కథావస్తువును సార్వజనీనం చేసేటందుకు వుపకరించే సాధనాలు.

కథా నిర్మాణంలో సంయోజనం, ఆకర్షణా వుండాలి. దానికి ఒకదానికి ఒకటి సమన్వయం అయ్యే ఆద్యంతాలు వుండాలి. విశ్వనాథవారి మొదటి నవలతో యీ కథా సంయోజనం ఎంత చక్కగా నిర్వహించ బడ్డదో, చివరి నవలలలో అది అంతగా విస్మరించబడ్డది. కథా ప్రారంభంలో సాగిన వుద్దేశ్యమూ, ఆశయమూ చివరివరకూ అదేరీతిగా వుండాలి. పాత్రల తత్వాలు

మారవచ్చు. సన్నివేశాల వైవిధ్యం చూపవ· కాని ఆద్యంతాల సమన్వయం లోపించకూడదు.

దీనికి సంబంధించిన ఒక విషయం ఇక్కడ ప్రస్తావించవలసి వుంది. "స్వర్గానికి నిచ్చెనలు"లో కథ అంతా ఒక ఎత్తు. చివరి అధ్యాయము ఒక ఎత్తు. నిజమే! కాని ఆదిమధ్యాంతములకు దానియందు సమన్వయం నాకు కుదురుట లేదు.

ఇది వసుంధర కథ. కొంతవరకు వామదేవుని కథ. ఒకవిధముగా ఆస్తిక నాస్తికుల కథ. ఎక్కువ ఆస్తికుల కథయే! భర్తృపిశాచముచేత ప్రేరేపించబడిన వసుంధర వస్తుతః చెడ్డది కాదు. ఆమె జీవితము చివరకు ఎటును కాకుండ పోయినది. చనిపోయి పిశాచమై పిశాచ ఆకారమున కూడ మొదటి భర్త దక్కలేదు. ఆ పిశాచము చూపుతానన్న కీర్తి దక్కలేదు, పైగా కట్టుకొన్న భర్తకు దూరమయినది. అట్టి వసుంధర—సర్వజనపరిత్యక్త—ఆమె ఒకనాడు పశుపతి శాస్త్రి వీణ వాయించుచుండగా విన్నది. ఆయన హిందూస్థానీ తోడి రాగమును షడ్జమంలో వాయిస్తున్నాడు. అది వసుంధర తన జీవితానికి వ్యాఖ్యానంగా భావించుకొన్నది. కాని వసుంధర పాత్ర యీ కథానిర్వహణలో రచయిత భావప్రకటనకు, సిద్ధాంత ప్రకటనమునకు ఒక ఉపకరణముగా మాత్రమే అయినది కాని ఆమె ప్రత్యేకమైన వ్యక్తిగా జీవించలేదు. ఇది వసుంధర కథకదా! ఇన్ని సన్నివేశముల తరువాత ఆ పాత్ర సాధించిన దేమి? ఆ పాత్ర ద్వారా రచయిత చెప్పదలుచుకొన్న దేమి?

రచయిత తానుగా, తన సిద్ధాంతములద్వారా చెప్పినది చాలా వున్నది. అయితే ముఖ్యపాత్ర ద్వారా చెప్పినపుడు అది కథానిర్వహణలో భాగం అవుతుంది. తన సిద్ధాంత నిరూపణకు ఆమె జీవితం దృష్ట్యా వ్యాఖ్యానం చెయ్యవచ్చును. రచయిత అది చేయలేదు. అది కథా నిర్వహణమున జరిగినలోపము. పాత్రపోషణమున జరిగిన లోపము.

కథాసంవిధానం తరువాత ముఖ్యమయినది పాత్రపోషణ. సాధారణంగా విశ్వనాథ రచనల్లో పాత్రల conception లోనే వైచిత్రి గోచరిస్తుంది. దీనికి కారణం ఇది: జీవన విధాన పరిశీలనలో విశ్వనాథకు 'వర్గీకరణ' గోచరించిందనుకుంటాను. సంఘంలో వ్యక్తులను ఆయన వేరు వేరుగా చూడరు. సర్వసాధారణంగా అందరూ ఆయనకు కొన్ని తరగుతులవారీగా విభజింపబడి వుంటారు, వారిలో వ్యక్తి నిష్ఠమైన ప్రత్యేకత వుండవచ్చును కాక—కాని

వారు మాత్రం ఆ ముఖ్యమైన తరగతుల్లో దేనికో ఒకదానికి చెందక తప్పదు, అందువల్ల ఆయన పాత్రలలో ఎక్కువ వ్యక్తిత్వం కలవి కావు. ఈ వర్గీకరణ ఆయన అన్ని నవలలలోను, అన్ని పాత్రలయందూ కనిపిస్తుంది. రచయిత symbolical గా చిత్రించదలచుకోవడంవల్ల జరిగిన నిర్ణయం యిది.

సాధారణంగా నవలలో ప్రతి పాత్రకూడా వ్యక్తిత్వాన్ని, సాధించుకొని తన కాళ్లమీద తాను నిలబడగలిగివుండాలి అంతేకాదు ఆ పాత్రల మాటా, చేతా ఆ పాత్రకు సహజమైవుండాలి. చదివేవారు—"అబ్బే! నేనే ఆ సమయంలో అక్కడవుంటే యీ మాట అనివుండే వాడినికాదు. ఈ పనిచేసి వుండను" అని అనుకోకూడదు. పైగా—"నేను అక్కడవుంటే యీ మాటే అనేవాడిని, యీ పనే చేసేవాడిని అనుకోవాలి" అలా అనిపించిన పాత్రలు సజీవపాత్రలు.

విశ్వనాథ నవలలో ప్రయోగించినయీ వర్గీకరణవల్ల పాత్ర పోషణలో వుండవలసిన ఒక సాధనాన్ని కోల్పోయాడు. ఆయన పాత్రలు ఆయన సృష్టిలా, ఆయనమాట జవదాటకుండా ఆయన ఆజ్ఞలను పరిపాలిస్తూవుంటాయి. కాని స్వతంత్రంగా ఏ పనులను చేస్తున్నట్లు వుండవు. అంటే ఇలా symbolicalగా పాత్రల్ని వూహించడంవల్ల వాస్తవికతకు అవరోధంకలిగిందన్నమాట, Symbol (ప్రతీక)ను తీసుకొని దానికి వాస్తవికతను కల్పించడం ద్వారా పాత్ర పోషణ పరిపుష్టమవుతుందే కాని, వాస్తవమైన జీవన విధానాన్ని కొన్ని symbols గా చేసి, వాటికి ప్రాణం పోయాలనుకొన్నప్పుడు అవి బ్రహ్మ సృష్టిగా కాక, విశ్వామిత్ర సృష్టిగా వుంటాయి.

అయితే యీ వర్గీకరణలోవున్న అవధులను దాటి, ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని సాధించుకొన్న పాత్రలు లేకపోలేదు. గిరిక, పసరిక, పాముల వాడు మొదలైనవి...గిరిక, పసరికల పాత్రలలో ఒక విచిత్రంవుంది. అవి smyblos గాఊహించబడి, symbols గానే అంతాన్ని పొందుతాయి. దానికీ, వాతావరణానికి, వానికీ, వాస్తవికతకూ సంబంధం దూరం దూరంగానే వుంచబడ్డది. అందువలన ఆ పాత్రల వ్యక్తిత్వానికీ గొప్పతనం చేకూరింది. బహుశః ప్రపంచచరిత్రలో నూతనంగా సృష్టింపబడిన పాత్రలు రెండే గోచరిస్తాయి నాకు. ప్రతిపాత్రసృష్టికీ వెనుక కొందరు వ్యక్తులు వుండక

తః పసరిక పూర్వము ఎవరి ఊహకును తట్టని, ఎవరునూ పూః లేని ఒక ప్రత్యేకమైన సృష్టి. Cervants వ్రాసిన Don Quixote లో Quixote పాత్ర ఒక స్వతంత్రమైన సృష్టి. తిరిగి అట్టి సృష్టిని విశ్వనాథయే చేసినాడు.

పాత్రలలో వైవిధ్యం ఎంత అవసరమో, వ్యక్తిత్వం కూడా అంత అవసరం. ఏ పాత్ర కాపాత్ర స్వయంగా ఆకర్షణీయాలై వుండాలి. ఎందువల్ల? కొత్తవయిన పాత్రలను రచయిత సృష్టించాలని మనం కోరడం సాహసం, మానవ ప్రకృతి కథారచయితకు కథావస్తువు! భిన్న ప్రకృతులు కలిగిన మనుష్యులు మనకు దినదినమూ ఎందరు కనపించినా ఆ ప్రకృతులు గణనీయం కావడానికి వీలులేనన్ని ఎక్కువగాలేవు. పైగా ఎన్నో వేల సంవత్సరాలనుండి, ఎందరో రచయితలు రచనలు చేస్తున్నారు......అందువల్ల రచయిత ప్రత్యేక సృష్టిని చేయలేడు. తనదైన వ్యక్తిత్వంలోనుంచే రచయిత తన పాత్రలను సృష్టించినా, ఆయన వ్యక్తిత్వంనుంచి ఆ పాత్రల వ్యక్తిత్వాన్ని వేరుచేసి వానికి స్వతంత్రమయిన ప్రతిపత్తిని కలగచెయ్యాలి. విశ్వనాథ అట్టి ప్రయత్నంలో కృతకృత్యుడు కాలేదనే చెప్పాలి.

విశ్వనాథ పాత్రల్లో మరో చమత్కారం వున్నది. నవల అన్నతరువాత కొందరు మంచివారు, కొందరు చెడ్డవారు - ఉండక తప్పదుకదా! అట్టిది ముఖ్యమైన వర్గీకరణ! మంచివారు సహజంగా నాయకులు కావడం, చెడ్డవారు ప్రతినాయకులు కావడం కూడా తెలుగునవలలకు ఆచారమే!

విశ్వనాథలోకూడా యీ ఆచారమే కనిపిస్తుంది. చెడ్డవాడై కూడా నాయకుడనిపించ దగినవాడు ఒక్క వామదేవుడు. చెలియలి-కట్టలో రంగారావు కూడా కథానాయకుడయితే—అతడు అట్టి నాయకులలో రెండవ వాడు.

విశ్వనాథ పాత్రల్లో విశ్వనాథ సత్యనారాయణగారే ప్రతిబింబిస్తారు. ఆయన కవితలో కంటె నవలలయందు ఆత్మాశ్రయ భావ మెక్కువగా కనిపించును, అందులోనూ మంచి పాత్రలలో ఆ ఆత్మాశ్రయత ఎక్కువగా కనిపిస్తుంది. మంచి పాత్రలలో అది మరీ ఎక్కువగా కనిపిస్తుంది. ఈ కనిపించడం నీవు విశ్వనాథ సమకాలికుడవు కనుక—అని అనవచ్చును. రచయిత ఆత్మాశ్రయతను తెలిసికొనుటకు సమకాలికత్వమే వుండనక్కరలేదు.

అంతకు ముందు మరియొక ప్రశ్నవున్నది. పాత్రలయందు ఆత్మాశ్రయత కూడదా? అని. ఉండవచ్చును. ఉండకతప్పదు కూడను. కూడదని ఎట్లు

చెప్పగలము ? ఒక రచయిత తన అనుభవముల పరిధిలోనుండి గ్రహించియే రచన చేయవలసును కదా ! ఆ అనుభవములు ఆయనకు ఆత్మగతములు కదా! అట్టియెడ అవి ఆత్మాశ్రయాలే అవుతాయి. కాని ఒక కథయందలి పాత్రలుగా వానిని ప్రవేశపెట్టేటప్పుడు వానికీ, వెనుక రచయితకూ వున్న సంబంధం రచయిత త్యజించాలి. లేకుంటే ఆ పాత్రలలో వైవిధ్యం లోపిస్తుంది. నిర్వ్యాజనీనత కొరవడుతుంది.

క రెండో ప్రశ్నవుంది. ఆత్మాశ్రయత ఉన్నది అని యీనాటివారే తెలుసుకోనగలరు కాని ముందు వారికి ఎలాతెలుస్తుందీ అని—రచయిత కొన్ని పాత్రలఎడ చూపిన పక్షపాతము వల్ల తెలుస్తుంది. ఆయన అట్టి పాత్రల చేత చెప్పించు తనవైన అభిప్రాయములచేత తెలుస్తుంది.

విశ్వనాథ పాత్రల్లో మరో చమత్కారం వున్నది. విశ్వనాథ రచనల్లోని దుష్టపాత్రల నిర్వహణను గురించి ప్రత్యేకమైన వ్యాసం వ్రాయవలసి వుంటుంది. ఆ పాత్రలన్నీ రచయితకు - జీవితంలో విలక్షణంగా కనిపించిన భావాలకు ప్రతిబింబాలు ఆ భావాలకు ఆకృతి కట్టిన చిత్రాలు. ఈ పాత్రల చిత్రణ విచిత్రంగా వుంటుంది. సాధారణంగా నవలలో నాయక ప్రతినాయకులైనవారి మధ్య వచ్చిన సంఘర్షణ పతాకగావుండి దాని ఫలితం రచయిత చెప్పదలచుకొన్న ఆశయంగా వుండడంకద్దు. ఆ సంఘర్షణ వుత్తమంగా వుండాలంటే నాయక ప్రతినాయకులు సమాన ఉజ్జీలై వుండాలి. నాయక ప్రతినాయకులని మనం ఆలోచించగానే మనకు తక్షణం గోచరించేవారు రామ, రావణులు—విశ్వనాథ రామాయణ కల్పవృక్షంలో చిత్రించిన రావణుడు ఎంత ఉదాత్తమయిన పాత్రో చూస్తే—యిలావుండాలి ప్రతినాయిక పాత్ర; ఇంత గొప్పగా రావణుడు ఎక్కడా చిత్రించబడలేదు....ఇట్టి వారి మధ్య జరిగే సంఘర్షణ ఉత్తమంగా వుంటుంది—అనిపిస్తుంది.

నవలలలో అలాకాక ప్రతినాయకులందరూ మొదటినుంచీ చిన్న చూపు చూడబడ్డారు. విశ్వనాథ కావాలని వారి పాత్రలకు ఆ అల్పత్వాన్ని కల్పించాడు. ఆ అల్పత్వం వారి పాత్రలలో లేదు. వారి పాత్రల లక్షణాలలోవుంది. ఆ పాత్రలు క్షణం క్షణం జీవంతోను, అతిశయించిన కోరికలతోనూ, శక్తియుక్తులతోను విజృంభించడానికి బదులు పోను పోను అవి నీరసంగాను, నిస్సత్తువగాను తయారు కావడమేకాక, హాస్యాస్పదంగా కూడా తయారవుతాయి.

ఈ పాత్రలు అంత సన్నిహితాలు కాకపోవడానికి మరొక కారణం నా కనిపిస్తుంది. విశ్వనాథ రచనల్లో హాస్యం చాలా తక్కువ, conscious గానో, un-concious గానో నవలల్లో హాస్యాన్ని పోషించలేదాయన. అయితే నాకొక భావం వున్నది. హాస్యాత్మక శీలత్వము ఉదాత్తతకు అపకర్షా హేతువని రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథ చెప్పాడు.

అ పరమోత్తమోత్తమున కక్కట! యున్నది లోపమెక్కడా
హా! పరిహాస శీలి యిత డద్దియ హేతువుగా నతండు వ
న్యాపథమిట్లు రావలసె... ...

అది ఒక్కటే రామునకు ఉన్న లోపంగా మారీచుడు రావణునకు చెబుతాడు. దానిని లోపంగా ఎంచడం వల్లనే తన నవలల్లో దానిని త్యజించాడా?

హాస్యరసపోషకములైన సన్నివేశములు, సంభాషణలు కూడా యీ నవలల్లో ఎక్కడో ఒకచోట కాని కనిపించవు. కాని హాస్యాన్ని చూపే అవకాశం వచ్చికూడా దానిని వినియోగించనిచోటు ఒక్క పాత్రపోషణలోనే—

ప్రతి నాయకుల నిర్వహణ అంతా satirical గా వ్యంగ్య పూరితంగానే సాగింది. ప్రతినాయకులనేకాదు, తనకు వ్యతిరేకములైన భావము లాలంబనగా చిత్రింపబడ్డ పాత్ర లన్నింటిని విశ్వనాథ వ్యంగ్యముగానే చిత్రించాడు. ఈ వ్యంగ్యచిత్రణ రచయితలో సానుభూతి లోపించినప్పుడు కాని జరుగదు. విశ్వనాథ తన కొన్ని పాత్రలలో తానే ఎలా ప్రతిబింబిస్తాడో చెప్పాను. దుష్ట పాత్రల దుష్టత్వానికి ఎదురుగా వారి పాత్ర స్వరూప స్వభావములలోకల హాస్య ప్రవృత్తిని చూపి, వానియెడ సానుభూతిని చూపగలిగివుంటే ఆ పాత్రలో స్వయంపోషకాలుగావుండి, ఇంకా ఎక్కువ స్థిరత్వాన్ని కలిగివుండేవి. అట్టి అవకాశం వుండికూడా విశ్వనాథ తన పాత్ర పోషణలో వ్యంగ్య చిత్రణను, అవహేళనా పూర్వకంగా చూపాడు. ఆయా పాత్రలను అవహేళన చెయ్యడంతో రచయితకు, తద్వారా పాఠకులకు ఆ పాత్రయందు సానుభూతి వుండదు. సానుభూతి లేకపోతే ఏపాత్రా ఎవ్వరినీ మెప్పించలేదు.

వేయి పడగలలో రంగారావు, ఆయనచుట్టును ఆయనవారుగా చెలామణి అయినవా రందరును అట్టివారు. తెఅచి రాజులో రంగనాథం అట్టివాడు. మా బాబులోని మేనమామ అట్టివాడు. ఇట్టివారు ఆయన చివరి నవలలలో ఎక్కువగా కన్పిస్తారు.

ఏ పాత్ర అయిన హాస్యాస్పదంగా సంఘటనలవల్ల తయారయితే, అది కథకు సంబంధించినది కనుక యిబ్బందిలేదు. రచయితే, వానిని అలా తయారు చేస్తే, ఆ పాత్రల మాటలపైన, చేతలపైన వ్యంగ్యపూరితమైన వ్యాఖ్యానాలు చేస్తే—రచయిత అయా పాత్రలపైన అట్టి భావంతోనే బయలుదేరాడన్న భావం కలుగక తప్పదు. అప్పుడూ అంత ప్రమాదం లేదు. పాత్రపోషణ దెబ్బ తిన్నా, రచయిత ఆత్మవైశిష్ట్యానికి లోటురాదు కాని రచయిత విమర్శలో, ఆయన వ్యంగ్యంలో ఆయన అవహేళనలో—వాని వెనుక ఎవరో మనుష్యులు చూపు కట్టే ఉండడం పాఠకులకు స్వచ్ఛంగా కనిపిస్తుంది. అది బాధనూ కలిగిస్తుంది. వ్యక్తులను చిత్రించ కూడదా? మహారాజులా చిత్రించవచ్చును. ఆ వ్యక్తి ఆ వ్యక్తిగా మనకు కనిపించకూడదు, ఆ వ్యక్తి ఆ పాత్రలో ఒదిగి పోయి మనకు పాత్రగానే కనిపించాలి. ఇట్టి పాత్రలు ఆయన సాంఘికమైన అన్ని నవలలలోనూ కనపిస్తుంది.

ఇలా కొన్ని పాత్రలను అవహేళన చెయ్యడంవల్ల కథలో రావలసిన బిగువు రాకపోవడం ఒక్కటే కాక, శిల్పానికి సంబంధించిన మరో సున్నితమైన సూత్రం దీనివల్ల అధిగమింపబడుతున్నది.

పాత్రల వ్యక్తిత్వాన్ని రచయిత బయటపెట్టకూడదు. ఆ పాత్రలే సమయానుకూలంగా తనును తాము పరిచయం చేసుకోవాలి. ఇలా winding and unwinding ఆ పాత్రలకు లేకపోతే సహజత్వానికి ఆఘాతం కలుగుతుంది. రచయిత పాత్రల పరిచయాన్ని సంఘటనలద్వారా సాధించవలె కాని తానుగా స్వభావ వర్ణన చెయ్యకూడదు. అలా చేయడంవల్ల రచయితవయిన యిష్టానిష్టాలు పాత్రలలోనూ ప్రతిబింబిస్తాయి. అప్పుడు పాత్రలలో మనకు వుండే వుత్సాహం తగ్గుతుంది. అందులోనూ ఆ పాత్రల ఉనికికి వ్యతిరేకంగా వానిని వ్యంగ్యంగా చిత్రించడంవల్ల ఆ పాత్రల వ్యక్తిత్వాన్ని విఫలం చేసినట్లవుతుంది.

పాత్రపోషణ విశ్వనాథలో సహజంగా సాగదని చెప్పావుకదా! పాత్రపోషణ సరిగా లేకపోతే కథాసంఘర్షణలో ఉద్వేగప్రతిపాదన వుండదుకదా! అట్టి వుద్వేగ రహితమైన నవల నవలగా చెలామణీ ఎలా అవుతుంది? అయినా యింతమంది ఎందుకు చదువుతారు? చదివినా విశ్వనాథను గొప్ప నవలా రచయితల్లో ఒకనిగా ఎందుకు పరిగణిస్తారు?—ఈ ప్రశ్నలన్నీ ఉత్పన్నమవుతున్నాయి.

ఉద్వేగోద్రేకాలు విశ్వనాథరచనల్లో వున్నట్లు తెలుగుదేశంలో మరి ఏ రచయితలోను లేవు. ఆ ఉద్వేగ ప్రతిపాదన ఆయిన రచనల్లో చమత్కారంగా వుంటుంది.

ఏమిటి ఆ చమత్కారం?

అసలు కథలో రెండురకాలయిన మనుష్యులు చిత్రింపబడతారు. అంటే కథలన్నింటిలోనూ చిత్రింపబడే పాత్రలను స్థూలంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. ఒకటి పూర్ణ ప్రకృతి. రెండోది అర్ధ ప్రకృతి.

కథానిర్వహణకు ముఖ్యమయిన పాత్రలు ఎప్పుడూ ఒకటో రెండో వుంటాయి ఆ పాత్రల గమనాన్ని జాగ్రత్తగా చిత్రిస్తాడు రచయిత. వేరు వేరు సమయాల్లో, వేరు వేరు సన్నివేశాల్లో, వేరు వేరు వ్యక్తులతో యీ పాత్రలకు గల సంబంధాన్ని సూచించేటప్పుడు ఆయా పాత్రల సర్వప్రకృతులను రచయిత నిరూపించాలి. అప్పుడు కాని ఆ పాత్రలలోని వైవిధ్యం స్పష్టంగా కనిపించదు. అలా అన్ని కోణాలనుండి సునిశితంగా—కథకు అవసరమైనంతవరకు—పరిశీలన జరుపబడి పోషింపబడ్డ పాత్రలు పూర్ణప్రకృతులు. ఇక అర్ధప్రకృతిగల పాత్రలు కథాగమనానికి పోషకంగా మాత్రమే వుండి, ఆ సన్నివేశ చిత్రణానికి ఉపకారకంగా వుండడానికి వీలుగాని తమ ప్రకృతిలో ఏదో భాగాన్ని మాత్రమే వ్యక్తంచేసి, మిగిలినవానిని వ్యక్తంచెయ్యనివి—కావ్యంలో అంగి, అంగరసాలతో వీనిని పోల్చవచ్చు.

ఇంతవరకు విశ్వనాథ పూర్ణప్రకృతుల నిర్వహణ సంగతి చెప్పాను. ఇందాక చెప్పిన ఉద్వేగ ప్రతిపాదన మిగిలిన అర్ధ ప్రకృతుల ద్వారా ఆయన సాధిస్తాడు. అంటే—నిజంగా సంఘర్షణ జరుగవలసిన ప్రధాన పాత్రల వైగుణ్యాన్ని కాదని ఆ సంఘర్షణవల్ల కలిగే ఉద్వేగాలను అంతకన్న తక్కువ ప్రధానమైన పాత్రల ద్వారా నిరూపిస్తారన్నమాట.

మానవుడి ఉద్వేగాలన్నిటిలోనూ శోకం ముఖ్యమయినది. హృదయాన్ని చలింపచేసే సన్నివేశాలు పాఠకుడికి ఎక్కువ సన్నిహితాలు అవుతాయి. అట్టి సన్నివేశాలు విశ్వనాథలో కూడా తక్కువగా ఏమీలేవు. విశ్వనాథ సాధారణమయినవిధానాన్ని అనుసరించలేదని చెప్పానుకదా! మరి విశ్వనాథపద్ధతి ఏది?

ప్రధాన పాత్రలంత ప్రధానములు కాని పాత్రల చేతలచేత యిట్టి సన్నివేశాలను విశ్వనాథ కల్పిస్తాడు. ఒక్క ఉదాహరణ చూపితే విశదం అవుతుంది.

చెలియలికట్ట వున్నది. చెలియలికట్టలో ప్రధానమైన పాత్రలు రెండు. రత్నావళి, రంగారావు. అసలు రత్నావళి మరీ ముఖ్యమయినపాత్ర. ఆ ముఖ్యమైనపాత్ర అంత ముఖ్యమయినపాత్ర అగుటకు తోడ్పడినవాడు రంగారావు. మిగిలిన పాత్రలంత ప్రధానములు కావు. సీతారామయ్య కూడను. సీతారామయ్య ఎందువల్ల ప్రధానపాత్ర కాదని చెప్పానంటే ఆయన పూర్ణప్రకృతి కథకు అవసరంలేదు కనుక—

రత్నావళి రంగారావులు ఏకశయ్యాగతులగుటచూచి సీతారామయ్య వారి నింటినుండి వెళ్ళిపొమ్మన్నాడు. వారును అందు కిష్టపడ్డారు. ఆ వెళ్ళిపోవునపుడు అంతవరకును గంభీరముగా వున్న సీతారామయ్య—నిలువత్రొక్కుకొనలేకపోయాడు. ఆ బండి కొంచెందూరం సాగిందో లేదో ఆయన రోడ్డుకు మధ్యగా కూర్చొని తలపై చేతులువేసుకొని ఏడ్చాడు. ఈ సన్నివేశము నిజముగా హృదయవిదారకమైనది. కాని యీ సన్నివేశమునకు మూలవేది రత్నావళి యింటినుండి వెళ్ళిపోవడం. ఆ వెళ్ళిపోవడం యిరుపక్షాలవారికీ శోకహేతువే! ఆ శోకము-కనీసము భయము - రత్నావళికి లేదా? రత్నావళి పద్దెనిమిదేళ్ళ పిల్ల. ఆమెకు తెలిసీ తెలియనితనము. ఎంత చదువుకున్నను సంప్రదాయము నెదిరించుట, కట్టుబాట్లను, సంఘమును ఎదిరించుట, భయమునకు కారణములే—

ఈ పాత్రల ఆత్మగతమయిన యీ భయము, యీ శోకము వాతావరణానికి జరిగిన సంఘర్షణకు జోడిస్తే దుఃఖంకలుగుతుంది. కాని విశ్వనాధ మిగిలిన పాత్రల మనోభావములను త్యజించి సీతారామయ్య దుఃఖముతో వాతావరణమును తనకనుగుణముగా మార్చుకొన్నాడు.

దాని ఎడల సీతారామయ్య ఎడ సానుభూతి కలిగిన కలుగును కాని - రత్నావళి పాత్రపోషణము సరిగా సాగలేదుకదా! ఆ సానుభూతి ఎవరిపై కలుగవలెను? రత్నావళిపైన—ఆమె ముందు ముందు కథలో జరిగినదానికి పశ్చాత్తప్త అగును కనుక ఆమెపైన చూపుటకు అనువుగా పాత్రపోషణ సాగాలి. పైగా ఆమెకు తరువాత, తరువాత కలుగు వైరాగ్య భావమునకు ఆ వియోగము నాడు తన హృదయమున కలిగిన బాధకూడ ఒక కారణము కావచ్చునుకదా!

ఉద్వేగభరితమైన ప్రధాన పాత్రలకు ఆలంబనముగా మాత్రమే మిగిలిన పాత్రలను ఉద్దేశించాలి. అందులోనూ రత్నావళి చేసిన పనికి సీతారామయ్య

దుఃఖము వ్యాఖ్యానమే కాదు. రత్నావళి చేయుచున్న పని కథయందు మలుపు తిరిగెడి ఘట్టము. ఆ ఘట్టమునందామె చేసెడి పనికి వ్యాఖ్యానముగా మిగిలిన పాత్రలు ప్రవర్తించినప్పుడు కాని ప్రధానపాత్రయందు మనకు సానుభూతి ఉత్సాహము కలుగవు. సీతారామయ్య చేసినది దానికి వ్యాఖ్యానముకాదు. దానకి విరుద్ధమయినది.

దీనిని sentiment అనవచ్చును. ఇది విశ్వనాథ సన్నివేశకల్పనలో సాధారణంగా సాగించే పద్ధతి.

ఇక సంభాషణలు వున్నాయి. పాత్రకు చేత ఎంతముఖ్యమో, మాట కూడా అంతే ముఖ్యం. సంభాషణల్లో కూడా సహజత్వం వుండితీరాలి. అంటే రచయిత తన భావాలను ఏవిధంగానూ తన పాత్రలమీద రుద్దకూడదన్నమాట. రచయిత తన భావాలు వ్యక్తం చెయ్యడానికే రచన సాగిస్తున్నాడు. నిజమే! కాని దానికి అనేక మార్గాలు వున్నాయి. కథాస్వీకరణంలో, దాని నిర్వహణలో, పాత్రపోషణలో, తాను మొగ్గే ఒక వైపును సూచించడంలో— రచయిత తన భావాలు వ్యక్తం చేయవచ్చు. కాని చాలమంది తెలుగు నవలా రచయితలు అందులో విశ్వనాథకూడా వున్నాడు—పాత్రలకు బదులు తామే మాట్లాడేస్తూ వుంటారు. ఉపన్యాసాల రూపంలో పాఠకుడికి నీతులు చెప్పేస్తూ వుంటారు.

విశ్వనాథకు జీవిత విధానాలను గురించి, ఎన్నో విషయాలను గురించి ఎన్నో అభిప్రాయాలు వున్నాయి. ఆ అభిప్రాయాలన్నీ అత్యుత్తమాలే, స్వీకార్యాలే! కాని అవసరానవసరాలను ఒక్క బిగినసాగే వుపన్యాసాలు చేతులో పాత్రలు వున్నాయికదా అని వానిని దుర్వినియోగం చెయ్యడమే! అదీకాక నవలలను నీతివాచకాలుగా చెయ్యడం తెలుగునాట ఎక్కువ అయిపోయింది. తెలుగువాళ్ళు చాలామంది చెడుమార్గాల్లో నడుస్తున్నారు. వాళ్ళు చాలామంది అంధులే! కాని వాళ్ళు దారికి రావడానికి ఉపన్యాసాలు ఏవిధంగానూ వుపయోగించవు. ఒక నవలను అందులో నీతికోసం ఎవ్వరూ చదవరు.

అంతమాత్రాన నీతిని నిరూపించకూడదనీ, స్థాపించకూడదని నా వుద్దేశ్యం కాదు. రచయిత తన వుద్దేశ్యాలను సంపూర్ణంగా వ్యక్తం చేయవలసిందే! కాని అభావాలు శిల్పానికి, కథాగమనానికి, అడ్డువచ్చేవిగా వుండకూడదు.

నిజానికి పాత్రోచితమైన దీర్ఘసంభాషణలు కూడా కథాగమనానికి ఆటంకాలు కావు. కాని విశ్వనాథ భావ వ్యక్తీకరణలో పాఠకుడు ఎప్పుడు విసుగును పొందుతాడంటే— ఆ పాత్రలను ఆపి విశ్వనాథ మాట్లాడడం; ఆ పాత్రలే విశ్వనాథ అంతగట్టిగా, అంత కోపంతోనూ మాట్లాడినప్పుడు— పాత్రల సంభాషణలలో కాని, జరిగిన సన్నివేశాల వ్యాఖ్యానంలో కాని రచయిత స్వాభిప్రాయాలు కాదు మనకు కావలసినవి. అవి ఆయాపాత్రల దృష్టిలో ఆయా సంఘటనల దృష్టిలో జరగాలి. రచయిత అభిప్రాయాలు వుంటే, అవి ఆ పాత్రలు కాని, ఆ సన్నివేశాలు కాని, సన్నివేశానంతరం సూచించే ఫలితాలలో వుండవలసిందే కాని యిలా వుపన్యాసాల రీతిలో సాగడం నవలయందు పాఠకుణ్ణి విముఖుణ్ణి మాత్రమే చేస్తుంది.

నవలల్లో సిద్ధాంత ప్రతిపాదన చెయ్యడం విశ్వనాథ ఉద్దేశ్యం. దానిని గురించి చర్చించడం—నవలల్లో వుండే కథ. సిద్ధాంతాలు ఎంత గొప్పవయినా, ఆ వాదన ఎంత తార్కికమైన సిద్ధాంతాలకోసం నవలలను ఎవ్వరూ చదవరు. నీతిబోధను వినడానికి, జ్ఞానోపార్జన చేసుకోవడానికి నవలలు వుద్దేశింపబడలేదు. అవి సాధించడానికి దేశంలో ఎన్నో ప్రక్రియలు వున్నాయి. వేరే పుస్తకాలు వున్నాయి. వానికోసం నవలలు వ్రాయనక్కరలేదు.

ఇన్ని విషయాలూ లోపరహితంగా సాగినప్పుడే నవల మంచినవల అనిపించుకోంటుంది. అట్టి నవలలే సార్వజనీనతను, సార్వకాలికతను సాధించుకోంటాయి.

ఇది యింతవరకు విశ్వనాథ నవలలయందలి శిల్పమును గురించిన చర్చ. ఇవి శిల్పవిషయమున నాకు కన్పించిన సమస్యలు.

ఇక భావములకు సంబంధించిన వైరుధ్యమున్నది. దానినికూడ ఒకటి రెండు భాగములుగా చేసి వివరిస్తాను.

## క్రమవిరుద్ధములయిన స్త్రీ పురుష సంబంధములు

పాశ్చాత్య నాగరికత దేశంలో అనాగరికతగా ప్రబలిన తరువాత ప్రేమ సిద్ధాంతం వికృతరూపం దాల్చింది. ప్రతివాడికి ప్రేమఅంటే ఆట అయిపోయింది. స్వర్గ ధామంలో హాయిగా విహరించే దానిని తీసుకొనివచ్చి మన దుమ్ము గోడ్లవెంట నడిపించి, మన మురుగుకాలువలను గెంతించి ఆప్యాయంగా దానిని

ఒంటికి పులుముకొని, కౌగిలించుకొని నానాహంగామా చేస్తున్నారు ప్రతి వాళ్ళూ - కనీసం భావకవిత్వం రోజుల్లో అలా చేశారు—

దానికి తోడు స్త్రీ పురుష సంబంధాల్లో స్వేచ్ఛ వుండాలనే వాదం విస్తృతంగా బయలుదేరింది దేశంలో. వీళ్ళ వాదం యిది: మగవారు స్త్రీలను బానిసలనుగా చేశారు. వారికి స్వాతంత్ర్యమే లేదు. వారిచేత యంత్రాల్లా పనులుచేయించుకొని తమ ఉద్రేకాలకు, అవసరాలకు పనికివచ్చే పరికరాలుగా మాత్రమే వారిని చూస్తున్నారు. కాని వారికి తగిన గౌరవం యివ్వడంలేదు.

ఈ వాదంతోపాటే మరో వుద్యమం కూడా బయలుదేరింది. అది విధవా వివాహం వుద్యమానికి జత. మగవారు అయితే భార్య పోతేనో, వదిలిపోతేనో రెండో పెళ్ళి, మూడో పెళ్ళి చేసుకుంటున్నారు. స్త్రీలు అలా చేసుకోవడానికి వీలులేదా ? అని.

ఈ రెండు వాదాలూ నేటికి కూడా వాదాలుగా మంచివే. ఈ వాదాలు బయలుదేరే నాటికి దేశంలో నిజంగా యింత కశ్మలం వున్నది. ఇంత అరాజకమూ వున్నది. ఎక్కువ మంది మగవాళ్ళు స్త్రీలను నీచంగానూ చూశారు. చసిపోయే మగవాడికి అప్పుడే పుట్టిన పిల్లను యిచ్చి పెళ్ళిళ్ళు చేశారు.

ఆ ఆచారాలకు వ్యతిరేకంగా సాగిన యీ వుద్యమాలకు సమాధానం యిచ్చాడా అన్నంత తీవ్రంగా వుంటాయి విశ్వనాథ నవలలు, దేశంలో తిరిగి యింతటి అరాచకాన్ని, క్రమ విరుద్ధాన్ని సృష్టిస్తాడా యీయన అన్నంత ఘాటుగా వుంటాయి ఆయన పాత్రల విశేషాలు. అంతేకాదు. ఆయన పాత్ర చిత్రణలో కూడా యీ విశృంఖల ప్రేమవాదానికి సమాధానమే కనిపిస్తుంది.

అయితే యిక్కడ ఒక ప్రశ్న వున్నది. మగవాళ్ళు అన్ని రంగాలలోనూ అధికారాన్ని చెలాయించడం, స్త్రీలను పురుషులకన్నా హీనంగా చూడడం ఒక extremity. దానిని కాదని స్త్రీ పురుషులకు సమానమైన హక్కులు వుండాలి. ఇంకామాట్లాడితే స్త్రీపురుషులు స్వేచ్ఛగాని యమరహితంగా ఉండాలి. అనడం మరో extremity. అలా కాకుండా హెచ్చు తగ్గుల ప్రసక్తిలేక ఇద్దరూ ఒక కాడికి కట్టిన గుర్రాలలానో, గాడిదలలానో పోవాలనడం మధ్యే మార్గం. అటువంటప్పుడు ఏ ఒక్క extremity ని సూచించినా అది అననుసరణీయమూ, విపరీతమూ అయిన పద్ధతిని ప్రచారం చెయ్యడమే అవుతుంది.

విశ్వనాథ అట్టి క్రమవిరుద్ధమయిన స్త్రీ పురుషుల సంబంధాన్ని చాలా నవలల్లో ప్రతిపాదించాడు. దేశంలో ఒక పురుషుడికి కాని, స్త్రీకి కాని వరుణ్ణో

వధువునో వెతకాలంటే 'తగిన వరుడు', 'తగిన వధువు' కోసం చూస్తారు. అందంలో చదువులో - కొందరికి ఆస్తిపాస్తుల్లో - ముఖ్యంగా వయసులో తగిన వారికోసం చూస్తారు. కాని విశ్వనాథలో యీ 'తగినతనమే' లోపించింది.

చెలియలికట్ట : సీతారామయ్య, రత్నావళి

బద్దన్న సేనాని : తిప్పన్న, చాదమ్మ, బాదమ్మ, బద్దిన్న

తెఱచిరాజు : సారథి, వాసంతి

ధర్మచక్రం : వీరపురుషదత్తుడు, షష్ఠశ్రీ— మొదలైనవి.

ఈ నవలలన్నింటిలోను పురుషుడు పెద్దవాడు. స్త్రీ చిన్నది. దేశమున కథలు వ్రాయుటకు సమాన వయస్కులు లేరా ? ఒకవిధంగా చూస్తే యీ క్రమవిరుద్ధత విశ్వనాథలో యాదృచ్ఛికంగా సంభవించినదికాదు. ఉద్దేశ్య పూర్వకంగానే దీనిని బలపరుస్తున్నాడని చెప్పాలి. ఎందువల్లనంటే రచయిత యిన్ని నవలలలో ఒకేవిధమయిన రూపకల్పన, సిద్ధాంత నిర్వచన చేస్తే— ఆ రచయిత చెప్పదలుచుకొన్నది అది అని స్పష్టమేకదా !

చెలియలికట్ట చూడండి. సీతారామయ్య రత్నావళిని పెళ్ళిచేసుకొన్నాడు. రెండవ పెండ్లి. రత్నావళి చిన్నది— అప్పటికే సీతారామయ్యకు ముప్పది యైదేండ్లు వచ్చినవి. అట్టి సంబంధమునుండి, తనకు యీడైనవాడైన రంగారావుతో ఆమె లేచిపోగా ఏమైనది ? ఆమె పశ్చాత్తాపపడినది. పరిహారముగా ఆత్మార్పణము చేసుకొన్నది. ఇది తాను సీతారామయ్య అను మనిషిని పెళ్ళి చేసుకొని లేచిపోవుటకు కాదు. వివాహసంబంధము అతిపవిత్రమయినది. దాని నుంచి స్త్రీపురుషులు విముక్తులు కాలేరు. ముఖ్యముగా స్త్రీ— నేను ఆ పాపము చేశాను కనుక పశ్చాత్తాపం అవసరం అని రత్నావళి అంటే— అది దాంపత్య జీవితానికి సంబంధించినంతవరకే యోగ్యమవుతున్నది. కాని దాంపత్యజీవితంలో సుఖదుఃఖాలకన్నా, ఆ దాంపత్యభావనే గొప్పదిగా నిరూపించడం కవి వుద్దేశ్యం. రత్నావళి పాత్రకు సమాంతరంగా సీతారామయ్య మూడవపెళ్లి భార్యను చిత్రించారు విశ్వనాథ. ఆ భార్య సీతారామయ్యతో సుఖంగా వుంటుంది. అతనివల్ల పండువంటి ఒక కొడుకును కంటుంది. ఈ పోలికవల్ల క్రమవిరుద్ధతనే విశ్వనాథ విశ్వసిస్తున్నాడని చెప్పవచ్చుకదా !

అది యీ ఒక్క నవలలోనే అయితే దానిని కథాసంబంధి వస్తువుగా మనం తీసుకోవచ్చు. కాని ఎన్నో నవలల్లో దానిని చిత్రించడం, దానిని సమర్థించడం— నేను చెప్పినదానిని బలపరుస్తున్నాయి.

వేయిపడగలలో ధర్మారావు, చిన్న అరుంధతుల సంబంధమును అక్రమ మనలేము. ధర్మారావు యుగసంధిలో మారుచున్న జాతిలో నిలిచిన సంప్రదాయమునకు ప్రతినిధి. చిన్న అరుంధతి గృహస్థాశ్రమమునకు మూలము. దాంపత్య విధానమునకు ప్రతినిధి. పాతివ్రత్యమునకు భంగము వాటిల్లినట్లు కన్పించినను, సనాతనమైన దాంపత్య ధర్మమునకు మాత్రము విఘాతము కలుగదని నిరూపించుటయే యీ రచన ముఖ్యోద్దేశ్యమని విశ్వనాథవారే వివరించారు.

బద్దన్న సేనానియందిది మరియు విచిత్రమై కన్పట్టును. బాదమ్మ భర్త ముసలివాడు. ఆమెకు అతనికి పడదు. ఆమె చాలరోజులు కాపురము చేసినది. అయినను బద్దన్నను ప్రేమించి అతనితో లేచిపోయినది. ఈ లేచిపోవుట సమంజస మనుకొన్నను అది విషాదాంతమయినది— బాదమ్మయు, బద్దన్నయు మరణింతురు— తిప్పన్న ముసలివాడు. వాని లెక్కకు బాదమ్మ యువతి. బాదమ్మ పెద్దది. ఆమె లెక్కకు బద్దన్న పసివాడు. చిత్రముగానున్నది. బద్దన్న బాదమ్మల సంబంధము లింగజ్ఞానాతీతమైన సంబంధమని రచయిత చెప్పినాడు. కాని ఆ మాట రచయిత మాటలలోనే వున్నది కాని నవలలో దాని చిత్రణము ఎక్కడా లేదు. ఈ క్రమవిరుద్ధమయిన స్త్రీపురుష సంబంధముల చిత్రణకు ఈయనలో అంతు కన్పట్టదు.

మరొక విచిత్రం వుంది. ఈ నవలలోని పురుషులందరు పెద్దవారు. స్త్రీలందరూ యీడునవారికి తగని చిన్నవారు. అంతేకాదు. వారందరికి ఆ స్త్రీలు రెండవ పెండ్లి భార్యలే! మగవారికి ఎంతవయసు వచ్చినను పెండ్లి చేసికొను వయసు మాత్రము దాటదని విశ్వనాథవారి అభిప్రాయమా?

యువతీ యువకుల మధ్య ప్రేమ భావము, దాంపత్య భావము వర్ధిల్ల వలయునని కోరవలయును కాని యిట్టి క్రమ విరుద్ధ చిత్రణమేమి?

## చలం : విశ్వనాథ

విశ్వనాథలానే చలం కూడా స్త్రీ పురుష సంబంధానికి సంబంధించిన రచనలనే ఎక్కువగా చేశాడు. ఇద్దరూ యీ సమస్యను చెరి ఒక కోణంనుంచీ చూశారు. ఇద్దరూ అతివాదులు. ఇద్దరికీ జరుగుతున్న పరిస్థితులమీద కోపగించుకోవడం వున్నది. దానికి వ్యతిరేకంగా సాగించే ప్రచారం వున్నది. బహుశః ఒకరికి ఒకరు సమాధానంగానే తమ రచనలు చేశారా అనిపిస్తుంది.

ఒక్కొక్కప్పుడు ఈ అతి వాద తత్వంవల్లనే కేవల నవలా రచనా శిల్పంలో ఇద్దరూ పరిపూర్ణతను సాధించలేక పోయినవారే !

## స్పర్శ సిద్ధాంతము - భవభూతి, విశ్వనాథ

విశ్వనాథ తన 'తెఱచిరాజు' లోను, 'ఏకవీర' లోను ఎక్కువగాను, 'చెలియకట్ట' లో సూచనామాత్రంగాను వివరించిన స్పర్శసిద్ధాంతమును ముందుగా ప్రపంచించినవాడు భవభూతి. 'ఉత్తరరామ చరితము' న సీతా రాముల వియోగానంతరము జరిగిన ఒక ఘట్టములో నిది సూచితము. అది ఒక ఛాయా నాటకమున. రాముడు మూర్ఛపోవును. ఆ మూర్ఛయందు రామునకు సీతకాని సీతయొక్క స్పర్శజ్ఞానము కలుగుటచే మూర్ఛనుండి తేరుకొనును. ఈ స్పర్శానుభవమును భవభూతి విపులముగా చర్చించినాడు. భవభూతి ఆ సిద్ధాంత ప్రతిపాదనవలన తన కథలో వివరముగా చెప్పుటకు వీలులేని అనేక విషయములను సూచనా మాత్రముగా వ్యక్తము చేసినాడు. సీత మరణించినదని భయపడుచున్నాడు రాముడు. అట్టివానికి సీత స్పర్శ జ్ఞానము ఒక ఆశను కల్పించినది. ఆ ఆశపై రాముడు బ్రతుకుట తరువాతి కథ యందంతటను నిక్షిప్తము.

విశ్వనాథ వివరించిన స్పర్శ సిద్ధాంతమునకును, భవభూతి సిద్ధాంతము నకును భేద మున్నది భవభూతి యందలి స్పర్శ ఉత్తమమైన దంపతులమధ్య కలిగిన జ్ఞానవిశేషము. ఆ స్పర్శ పూర్వ జీవనానుభవమే కాని నూత్నము కాదు. "స్పర్శః పురాపరిచితో నియతం స ఏష" అని విపులముగా స్పష్టముచేసినాడు భవభూతి. ఉన్నతమూ, ఆదర్శమూ అయిన ప్రేమ సూచకముగా ఉద్దేశించ బడిన యీ స్పర్శ సిద్ధాంతము కేవలము ఆజన్మకే సంబంధించినది. సీతా రాముల విషయమున పూర్వానుభవము కలది.

విశ్వనాథయందు ఈ సిద్ధాంతము భవభూతి నధిగమించి నడచినది. భవభూతియందు స్పర్శ కేవలము పవిత్ర దాంపత్యభావ సూచకముగా కాగా, విశ్వనాథయందలి స్పర్శ ఆజన్మ ప్రేరితము. అది అనాది జీవలక్షణము. సీతా రాముల స్పర్శ ఒండొరులకు పూర్వము జ్ఞప్తియందున్నది. అనుభవించినది. కాని విశ్వనాథ సూచించిన స్పర్శ ఈ జన్మయందు పూర్వానుభవ మక్కర లేనిది. పూర్వజన్మ నిష్ఠమైనది. 'తెఱచిరాజు' లోని వాసంతి యీ సిద్ధాంతమున కొన్ని ప్రయోగములను చేయును. సారథి, తంత్రి, కిరీటి, రంగనాథము—



ఇట్లు తన జీవితమునకు సంబంధించిన వేరువేరు వ్యక్తిత్వములు కలవారియెడ తనకు కలిగిన స్పర్శానుభూతిని నియమించుకొనుట ఆమె లక్షణము. ఆమె కడు అమాయిక. ప్రపంచపు పోకడలు తెలియనిది. స్త్రీ పురుషసంబంధము కొసమంతయు తెలియకపోవుట ఆ ప్రాంతమందుగల చిత్రము. కాగా, ఆమె సారథి స్పర్శ కలుగనే ఒక విచిత్రమయిన అనుభూతిని పొందినది. ఆ అనుభూతి యీ జన్మసంబంధియగుటకు వీలులేనిది. అది అనాద జీవలక్షణము. తరతరములుగా అదిరక్తనిష్ఠమైన ఒక గుణము. విశ్వనాథకు దాంపత్యభావము ఎన్నియో జన్మలవెనుకనుంచి వచ్చెడి ఒక పవిత్రసంబంధము. ఆ సంబంధమును సూచించుటకు యీ స్పర్శను ఛాయగాచేసి చూపినాడు. ఆ చేయుటలో భవభూతికన్న కొంచెము ముందుకు సాగినాడు.

అయినచో విశ్వనాథ సాధించినదేమి ? భవభూతి తన కథకు ఉపస్కారముగా నుండుటకు; ముందుజరుగు కథను సూచించుటకు; నిజానిజముల నొక ఉద్విగ్నస్థితిలో నుంచుటకు, సీతారాముల పాత్రపోషణమున నొక అసాధారణత్వమును కల్పించుటకు యీ స్పర్శసిద్ధాంతము నాధారము చేసికొన్నాడు. కాగా, విశ్వనాథ యీ సిద్ధాంతమును సిద్ధాంతముగ మాత్రమే స్వీకరించినాడు. ఆ సిద్ధాంత నిరూపణమే కథ. దీనివలన విశ్వనాథ నిరూపించదలుచుకున్నది స్త్రీ పురుష సంబంధము అనాది అనియే అయినచో—అది కేవలము సిద్ధాంతముగా చెప్పవలసిన విషయమేకాని, దానిని నిరూపించుటకు కొన్ని పాత్రలను సృష్టించుట, ఆ పాత్రలు పాత్రలుగా నిలువక ప్రతినిమిషము ఆ సిద్ధాంతమును అందుకొనుటకు ప్రయత్నించుట జరుగుచున్నది ఇట్లు కేవలము సిద్ధాంత ప్రతిపాదన దాని నిరూపణకు ఉద్దేశ్యముగా కలదగుటవలన యీ నవల నవల కాని నవల. ఈ సిద్ధాంత నిరూపణమే ఆశయముగా పెట్టుకొనుటవలన విశ్వనాథ యీ నవలకు సంబంధించినంతవరకు నవలాకారుడుగా సార్వజనీనతను సాధించలేకపోయినాడు.

ఈ సిద్ధాంతము మరి రెండు నవలలయందు ప్రయుక్తమయినది. 'ఏకవీర' యందు దీని ఉనికి విలక్షణమైనది. ఏకవీర, కుట్టాన్, మీనాక్షి, వీరభూపతుల సంబంధము విచిత్రమయినది. అది ఒక నాలుగు స్తంభాలాట. స్తంభముల చుట్టు ప్రక్కప్రక్కగా తిరుగవలయునుకాని, ఒక స్తంభమునుదాటి మరియొక స్తంభమునకు రా వీలుపడదు. Cross section కూడదనుట. ఇది ఆ పాత్రల

భావనమునందు ప్రాథమిక లక్షణము. వారి గత జీవన విశేషము లందు కుపకర్ష హేతువులు.

అంతవరకు చక్కగానున్నది. వాకిటిముందు కూచిపూడివారి భాగవతము జరుగుచున్నది. ఏకవీర సున్నితమైన మానిసి. ఆమె చిన్ననాట ఒకనిని ప్రేమించినది. ఆ ప్రేమ నిష్ఫలముకాగా, తనభర్తను నిజముగా పూజించు మనసుతో అతనిని చేరినది. అతడు నిరాకరించినాడు. ఆమె మనసు తిరిగి చిన్ననాటి ప్రేమికునివైపుకు మరలినది. ఆ చిన్ననాటి ప్రేమికుడు తిరిగి ఆనాటి రాత్రి స్థానాపతియింట తనకు దర్శనమిచ్చినాడు. ఆమె ఉద్విగ్న అయినది. ఆమె అతని కౌగిలియందిమిడిపోయినది.

ఇది స్పర్శ. అతని కౌగిలినుండి విడిపోయిన వెంటనే ఆమెకు పూర్వాపరముల జ్ఞానము వచ్చినది. ఆమె శరీరమునందెల్ల యెడల అగ్నిగోళములు మండుచున్నట్లున్నది. అది వైగైనది శీతల శీకరములతో కాని చల్లార్చబడ లేదు.

ఇచట దాంపత్య భావనమునకు ఆదర్శప్రాయమైన ప్రేమ సూచింపబడినది. తానింతసేపు వీరభూపతి కౌగిలిలోనుండుట, అతని స్పర్శ తనకానంద దాయకమగుట స్పర్శ సిద్ధాంతమునకు విరుద్ధములు. ఆమె సున్నితమైన తత్త్వముకలది. దాంపత్య భావమున గౌరవముకలది, దానికి ప్రత్యామ్నాయముగ తానింతవరకు వీరభూపతి కౌగిలియందుండుటను తెలిసికొనగానే ఆమె మారిపోయినది. ఇది స్పర్శ సిద్ధాంతమునకు అపకర్ష హేతువు. ఇది కేవలము పవిత్ర దాంపత్య భావమును స్థాపితము చేయుటకు వీలుగా కల్పించబడిన సన్నివేశము మాత్రమే.

ఇట్టి భావమే రత్నావళియందు మరియొక కోణమునుండి చూపబడినది. ఆమె రంగారావుతోడి సంబంధముతో మురియుటకు ఆమె ఆంగ్లపు చదువు, క్రొత్త పోకడలు కారణములుగా సూచితములు. అందువలన ఆమెకు కలిగిన స్పర్శానుభూతియందు వైలక్షణ్యము గోచరించుటకు ఆలస్యమయినది. కాలమును పోషించుటయందు, దాని నాధారముగా కథకు వినూత్నమయిన వ్యాఖ్యానము చేయుటయందు విశ్వనాథ దృష్టి ఎంత సమగ్రమయినదో యీ సంఘటనము చూపును.

అయినను యీ స్పర్శ కూడా దాంపత్యభావనోద్దీపనమునే నియమించును కాని, స్పర్శ సిద్ధాంతమును కాదు. చెలియలికట్టయందు విశ్వనాథ భవభూతి

భావమునే గ్రహించె ననవచ్చును. కాని రత్నావళికి భర్త యెడల కల స్పర్శానుభూతి ఆనందాయిక మగుచో అసలు కథయే లేదు. క్రొత్త నీరు వచ్చుటతో— రత్నావళి వంటి మిడిమిడి జ్ఞానము కలవారు హెచ్చగుటతో సాంఘిక వ్యవస్థ కలుషితమైనది. ఆకలుషిత మగుట రత్నావళి లేచిపోవుటతో పరాకాష్ఠ నందినది. నిజమే. కాని స్పర్శ అన్నది రక్తనిష్ఠమయిన గుణము కదా! అందును విశ్వనాథయందది తరతరముల అనుభూతి విశేషమే కాని, ఆ జన్మకు సంబంధించినది మాత్రము కాదుకదా! అది కేవలము మనోభావమైనచో, ఆ మనోభావము తాత్కాలికముగా అడ్డగించబడియుండుట కవకాశముండును. కాని రత్నావళి విషయమున అది ఏ మాత్రమును సూచితము కాదు. ఏకవీరలో వలె, చెలియలికట్టయందు కూడ స్పర్శ సిద్ధాంతము - భవభూతియందు వలె - లేదు. దాంపత్య భావమునకు ఉద్దీపనము కలిగించవలసిన స్త్రీ పురుష స్పర్శ - దానివలన కలుగు అనుభూతుల వైలక్షణ్యము లేదు. ఈ స్పర్శ సిద్ధాంతము భవభూతిలో వలె వెనుక అనుభవించినది కాదు. రక్తనిష్ఠము కాదు. దాంపత్య భావమునకు వ్యతిరేకమనుటవలన కలిగిన మనోవైకల్యము మాత్రమే!

అనగా భవభూతి సిద్ధాంతము చేసిన స్పర్శకు విశ్వనాథ వ్యాఖ్యానమును చేసి, దానిని తనదగు సిద్ధాంతమైన పవిత్ర దాంపత్యభావమును నిరూపించుట కొక ఆధారముగా చేసికొన్నాడే కాని స్పర్శ సిద్ధాంతమును ప్రయుక్తము చేయలేదు.

ఇవి స్థూలముగా విశ్వనాథ నవలలను చదువగా చదువగా నాకు తట్టిన కొన్ని సమస్యలు.

* * * *

నేను విశ్వనాథ నవలలను నేను వ్రాస్తూవున్న పుస్తకంకోసం అధ్యయనం చేస్తూవుండగా 'రసధుని' వారి ఆహ్వానం అందింది. అప్పుడు రంధ్రాన్వేషణం చెయ్యడం మొదలుపెట్టాను. అవునయ్యా! నీకు విశ్వనాథలో అన్నీ లోపాలూ, సమస్యలే కనిపించాయా అనవచ్చు. ఇప్పుడు నేను చెప్పినవానిలో చాలభాగము ఆనవలలలోని విశిష్టతలే. కాని వానికి జరుగు వ్యాఖ్యానము విపరీతముగా ఉన్నది. ఆ వ్యాఖ్యానములపై యిది నా విమర్శ. అదీకాక, రసధునివారి ఆజ్ఞ ఒక కారణం. మరొకటి: యీ సమస్యలే నన్ను చాలకాలంనుంచీ బాధపెడుతున్నాయి. వీనికి పరిష్కారమార్గం ఉంటే తెలుసుకోవాలన్న కుతూహలం

[తరువాయి 36 వ పేజీలో]

కవిత :

# ఒడ్డెవాఁడు

—శ్రీ అందె వెంకటరాజము

చింపులచాఁప కప్పుగల చిన్న కుటీరమునందు నేగతిన్
గంపెఁడు బొట్టెగాండ్ర బలగమ్మున నుందువో యొడ్డెవాఁడ! నీ
తెంపు వచింపరా దడవిదిబ్బ బిడారముగా నొనర్చి యీ
గుంపును గూడి బండబ్రదుకున్ నడిపింతు మృగంబు చాడ్పునన్.

రాలు కొట్టికొట్టి రాపడి నీ గుండె
రాతికన్న దృఢతరంబు జెందె ;
జేల జాలువాఱు జాలియు బాలియు
నేఁ నీతిగీతి యేల లెసఁగు ?

---

విశ్వనాథవారి నవలలు ★ (35 వ పేజీ తరువాయి)

రెండో కారణం విశ్వనాథ నవలలపై నేను వ్రాస్తున్న పుస్తకంలో యీ యీ సమస్యలను గురించి ముందు ఆలోచించి, వానిపై ఒక నిర్ధారణకు రావాలి అని ఒక పట్టిక తయారుచేశాను. వీనికి సమన్వయం సాధించడం నాకు ఆనంద దాయక మైనంతగా మరి ఎవ్వరికీ కాదు.

పైగా యీ సమస్యలే కాదుకదా విశ్వనాథలో వున్నవి. అసల గుణ విభాగం వున్నది. అందులో కొన్ని వేల విషయాలను గూర్చిన చర్చ వున్నది. విశ్వనాథ భావ ఔన్నత్యము, కాలమునకు ఆయన వ్యాఖ్య, విశ్వనాథ నవలల యందు సూచింపబడిన కాలము—దాని పూర్వాపర విచారణ, ఆయనశైలి, సంప్రదాయమునకు విశ్వనాథ వ్యాఖ్య మొదలైన వేయివేల విషయాలున్నవి.

ఈ 'రసధుని' ఆహ్వానం నా అధ్యయనంలో క్రొత్తరుచుల్ని చూపింది, క్రొత్త ఆలోచనలను రేపింది. అది నా అధ్యయనానికి సార్థకత. అందుకు 'రసధుని'కి కృతజ్ఞుణ్ణి.

ధారుణి వింతవింతలగు తాజమహల్ మొదలైన మేలి సిం
గారము తళ్కులీను బలుకట్టడముల్ రచియించి యంబర
స్ఫారయశోవిశాలు రగు ప్రాక్తనశిల్పులు నీ కులస్థులౌ
వారె కదా! ఇటుల్ వికృతవైఖరిఁ జెందెనె మీ స్వరూపముల్!

తడిలేని పాషాణతలము సుత్తెలఁ ద్రవ్వి
వింతైన పంట పండింతు వీవు
రమణీయ హర్మ్య నిర్మాణంబునకు మొక్క
వోని సంపద నింపిపోవు దీవు
పాకంబులోని సంబారంపు దివ్య సా
రము పిండియిచ్చు నేర్పరివి నీవు
ఘన తటాకాదుల గాంభీర్యములు నిల్పి
ప్రజల జీవనము కాపాడు దీవు,
పామరులు సయితంబు దైవములఁ దలఁచి
కేల్మోగుచునట్లు జేసి మ్రొక్కింతు వీవు-
ఆటవికజాతి నీది, నీయంతవారు
గలరె యెంతేఁ విలక్షణగరిమ గలిగి.

పూవుల పాన్పులోన నొక మొగ్గయుఁ గల్గిన నొత్తు సున్నితం
బై విలసిల్లు నాగరలతాంగుల కింపులు వన్నెచిన్నియల్
గావలెఁ గాక మా మొరటుకత్తెల కేల యటంచు వన్య వృ
క్షావళి చందమై అవికలైన ధరింపరొ మీ పొలంతుకల్?

మీ కంటెఁ గడు క్రూరవర్తనములన్ మిట్టాడు కౌలేయకా
నీకంబుల్ ప్రతిగూటి పొంతల మదాంధీభూత దుర్వార ఘో
రాకారంబుల నిల్చి భీమభషణ వ్యాఘాత జాతంబుతో
నేకంబై తరుమంగ నిల్చునె మృగం బేదైన మీ సీమలోఁ.



ఎండల వేడిగాడ్పు లెరియింప స్రవించు నిదాఘబిందులన్
కండలు నుగ్గులై కరగి కాయ మయోమయమై తపింపఁగా
కొండల బండలన్ బగులఁగొట్టి మృదుత్వము గొల్పి యొప్పులౌ
ఖండికలన్ వెలార్చెదవు; కమ్మరి, కుమ్మరి నీకు సాటియే ?

పైఁ జేరి పయనించు పాషాణనిచయంబు
మించు బారికిలోఁ జలించుచుండ
మోయలేక భ్రమించు మోటుచక్రాల్ తోడి
వెత జూడలేక గీపెట్టుచుండ
వేగించు నీ జాడ విన్నట్టి జనులకు
నెడఁదల్ కరగి గగుర్పొడుచుచుండ
నీ శుష్కచర్యకు నిల్వక పశుపక్షి
నికరంబు కలఁగి నిందించుచుండ.
తలకు మించిన భారంబు నిలిపినట్టి
వట్టి శ్రుతిలేని బండినిబట్టి బడుగు
టావులన్ గట్టి తోల్కొని యరుగుదెంతు
వక్కటా! వాని కన్నీటి నరసినావె ?

కాయము పుండుచేసికొని కష్టములోర్చి గడించుకొన్న యా
దాయము పాడునీళ్ళకయి దండుగవోసి మతిభ్రమంబునన్
హాయియటంచు రేగుదు వహా! యొకయింత శ్రమంబు వాసినన్
శ్రేయములేదు, నీ కృషికి జీవిత మెన్నఁడు ధన్యమయ్యెడిన్ ?

అరుదౌ నీదు శ్రమంబు మెప్పయిన నీ యార్భాట మింతంతగా
దరరే! నీ శిలలన్ బలెన్ దొరలు సత్యాపేత దుర్భాషణల్
మరి మీ కయ్యములన్ జగం బగిలి తీర్మానంబు గాకుండు నె
వ్వరు దిద్దంగలరయ్య మీ పరిసర ప్రారబ్ధ మిట్లుండఁగన్.

ప్రథమాంధ్ర నాటకకర్తలు :

# వల్లభామాత్యుడు[1]

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు, ఎం. ఏ.

ముందుగా సంస్కృత 'వీథీ' లక్షణమును వివరించి దానిని క్రీడాభిరామముతో సమన్వయించి, పిమ్మట వల్లభామాత్యుని ప్రశంసచేయుదును.

## 1.

### లక్షణకర్తలు

నాట్యశాస్త్రము : భరతుని నాట్యశాస్త్రమందు (క్రీ. పూ. 200 - క్రీ. శ. 300) వీథీ లక్షణ మీ క్రిందివిధముగా నున్నది— "ఇందు ఒకే అంకము ఉండును. ఇది ఏకహార్యముకాని, ద్విహార్యముకాని కావచ్చును. (ఒకే పాత్రచే లేదా ఇరువురు పాత్రలచే ప్రయుక్తమగును). ఇందు రసములన్నియును ఉండును. అధమ - ఉత్తమ - మధ్యమ ప్రకృతులు ముప్పురును ఇందుండవచ్చును. మరియు ఇందు 13 వీథ్యంగములుండును." [నాట్యశాస్త్రము - 18 వ అధ్యా. - 112-114 శ్లో.]

పై వీథీలక్షణమును అభినవగుప్తుడు (క్రీ. శ. 1000 ప్రాంతముల) క్రిందివిధముగా వ్యాఖ్యానించెను— "ఇది సర్వరస మయమగుటచేతను, ఇందలి అంగములు నాటకాదిభాణాంత సమస్త రూపకోపజీవ్యములగుటచేతను రూపకములన్నియును వివిరింపబడిన పిమ్మట, చివర వీథి వివరింపబడుచున్నది. ఏకపాత్ర ప్రయుక్తమైనప్పుడు ఆకాశపురుషభాషితముతో సంభాషణము సాగును. ఇరువురు పాత్ర లున్నప్పుడు ఉక్తి - ప్రత్యుక్తి - వైచిత్ర్య రూపమున సంభాషణము సాగును. ప్రశ్న - ప్రతివచనములకు అన్యాభిప్రాయ రూపమగు

1. "ప్రథమాంధ్ర నాటక కర్తలు" అనెడి శీర్షికలో న్యాయముగా ఇది మొదటి వ్యాసము కావలసిఉన్నది. కాని ఈ వ్యాసమునే "వీథి : క్రీడాభిరామము," అను పేర వ్రాసి ఇంచుమించుగా సంవత్సరము క్రిందట ఒకరికి పంపియున్నాను. ఇంతవరకు వారినుండి సమాధానము కాని, నా వ్యాసము తిరిగివచ్చుట కాని జరుగలేదు. నాకడ ఇంకొక ప్రతికూడలేదు. అప్పుడు వారము పదిరోజులు శ్రమించి వ్రాసిన వ్యాసమది. పై కారణమునుబట్టి నా వ్యాసము నాకు తిరిగివచ్చుననెడి ఆశ లేకపోవుటచే ఇప్పుడు దానిని జ్ఞాపకమున్నంత వరకును మరల వ్రాసి ప్రకటించుచున్నాను.

సంబంధముచే కలుగు వైచిత్ర్యము 'వీథ్యంగ' మనబడును. లక్షణ - అలంకారాదులకు ఇట్టి ఉక్తి నియతమైన రూపములేదు: ఉక్తి నియతమగు వైచిత్ర్యము కల వీథ్యంగములు పైవానికంటె భిన్నములని తెలియవలెను. ఇట్లు, ఉక్తి - ప్రత్యుక్తి గర్భితమై పంక్తివలె ఉండును కాన ఇది 'వీథి' అనబడినది. వీథి సర్వరస సంపన్న మగుటచే అన్ని రకముల ప్రకృతులును ఇందు నాయకులు కావచ్చును. కాని, అధమప్రకృతి నాయకు డగుటకు కొందరంగీకరించరు. మరి ప్రహసన - భాణాదుల విషయమున వారి కిట్టి అభ్యంతరము లేదేమి? హాస్యరసము ప్రధానముగా ఉన్నప్పుడు అధముడే నాయకుడగును. కోహలుడుకూడ

ఉత్తమాధమ మధ్యాభి ర్యుక్తా ప్రకృతిభి స్తథా।
ఏకహార్యా ద్విహార్యా వా సా వీథీ త్యభిసంజ్ఞితా॥

అనుచు వీథియందు అధమనాయకత్వమును అంగీకరించియుండుట గమనార్హము. ముఖ్య ఫలముతో ప్రధానముగా సంబంధించియున్న వ్యక్తి నాయకుడనబడును కదా? అధము డట్లు ఒకవేళ నాయకుడు కాకపోయినను వానియందు అధమత్వము అనుపాదేయము కాజాలదు. పరివార రూపమున అయినను వానికి కథలో ప్రవేశము ఉండనేడున్నది." [అభినవభారతి - బరోడాముద్రణము, 2వ సం - పుటలు 452 459].

**ఇతర లక్షణకర్తలు:** అర్వాచీనులైన నాటక లక్షణకర్త లందరును రూపక విషయము లన్నింటియందును భరత - అభినవగుప్తులనే ప్రధానముగా అనుసరించుచు కొన్నియెడల కాలానుగుణముగా వచ్చిన మార్పులను గూడ పరిగ్రహించుచు తమ తమ గ్రంథములను రచించిరి. అట్టి వారిలో 'దశరూపక' కర్త ధనంజయుడు (క్రీ. శ. 974-996 ప్రాంతముల) 'శృంగార ప్రకాశ' కర్త భోజుడు (క్రీ. శ. 1005-1054), 'నాటకలక్షణ రత్నకోశ' కర్త సాగరనంది (క్రీ. శ. 920-1100) 'కావ్యానుశాసన' కర్త హేమచంద్రుడు (క్రీ. శ. 1089-1173), 'నాట్యదర్పణ' కర్తలు హేమచంద్ర - గుణచంద్రులు (క్రీ. శ. 1100-1175), 'భావప్రకాశ కర్త' శారదాతనయుడు (క్రీ. శ. 1175-1250), ప్రతాపరుద్రీయ కర్త విద్యానాథుడు (క్రీ. శ.. 14 వ శతాబ్ది ప్రథమ భాగము), సాహిత్యదర్పణ కర్త విశ్వనాథుడు (క్రీ. శ. 1300-1380), సింగభూపాలుడు (క్రీ. శ. 1330-1360) అను వారలు ముఖ్యులు. వీరి రచనలలో ధనంజయుని దశరూపకమును, దానికి వ్యాఖ్య అయిన ధనికుని 'అవలోకము' ను బహు

ప్రసిద్ధినందినవి. నిర్వచనములందు దశరూపకమునకును, నాట్యశాస్త్రమునకును భేదము కన్పట్టుచుండును. తక్కిన వారిలో సాగరనందియు, హేమచంద్రుడును, రామచంద్ర - గుణచంద్రులును శింగభూపాలుడును భరత - అభినవగుప్తులను అనుసరింపగా తదితరు లధికముగా దశరూపకమును అనుసరించిరని స్థూలముగా చెప్పవచ్చును. కాని, అన్నింటికిని నాట్యశాస్త్రము మూలగ్రంథ మనుట మరవ రానిది. ఇంక ఈ లక్షణ కర్తలు వీథి నెట్లు నిర్వచించిరో వివరింతును—

ధనంజయుడు : వీథి కైశికీవృత్తియందు రచింపబడవలెను. సంధి-అంగ-అంకములు భాణతుల్యములు (అనగా ముఖ-నిర్వహణ సంధులు, వాని అంగములు, ఒకే అంకము ఉండును). శృంగారమునకు పూర్ణపోషణము ఉండదు కాని అధికముగా సూచింపబడవలెను. ఇతర రసములు కూడ ఇందు స్పృశింపబడును. ప్రస్తావనయందు చెప్పబడిన ఉద్ఘాత్యకాద్యంగములిం దుండును. ఇది ఒక పాత్రచే కాని, ఇరువురు పాత్రలచే కాని ప్రయుక్తమగును [దశరూపకము - 3 వ ప్రకాశము - 68,69 శ్లో.]

దీనిపై వ్యాఖ్యానించుచు "వీథి అనగా మార్గము లేదా పంక్తి. ఇందు అంగముల పంక్తి ఉండును కాన ఇది వీథి అనబడినది" అని ధనికుడు పేర్కొనెను.

సాగరనంది : 'వకుల వీథిక' యందువలె ఇది ముగ్గురు పాత్రలచే ప్రయుక్తము కావలెను. ఉత్తమ - మధ్యమ - అధమ నాయికా భూషితమై, చిత్రప్రకృతియుతమై యుండును. ఇది ఏకాంకము. బీజ-బిందు-కార్యము లనెడి అర్థప్రకృతులైదే ఉండును. ముఖ-నిర్వహణ సంధులు రెండే ఉండును. నానా రస-భావసంహితమై త్రయోదశాంగయుక్తమగును. [నాటకలక్షణ రత్న కోశము - పుట 121]

హేమచంద్రుడు : సర్వరస-లక్షణాఢ్యము, త్రయోదశాంగ యుక్తము, ఏకాంకము. ఏకహార్యము లేదా ద్విహార్యము అగునట్లుగా వీథిని రచింపవలెను. అనగా శృంగారాది సర్వరసములచే, షట్త్రింశత్ (36) లక్షణములచే, గుణ-అలంకారాదులచే, త్రయోదశాంగములచే భూషితము కావలయును. ఏకాంక మనుటచే ఇతివృత్త సంక్షేపము చెప్పబడినది. మరియు ఉక్తప్రకార వ్యతిరిక్త మైన వక్రోక్త్యంతరసహాస్రసంకులముగా ఉండవలెను. [కావ్యానుశాసనము-8 వ అధ్యాయము - పుట 436]

రామచంద్ర - గుణచంద్రులు : సర్వ - స్వామిరసమును, ఏకాంకమును, ఏకపాత్రికము లేదా ద్విపాత్రికమును, ముఖ - నిర్వాహసంధియుక్తమును,

సర్వరూపోపయోగినియును అగునది వీథి అనబడును. వక్రోక్తిమార్గము కలదగుటచే ఇది వీథి అనబడినది. సర్వస్వామికమనుటచే ముగ్గురు ప్రకృతులును ఇందు నాయకులుగా ఉండవచ్చును. శృంగారాది సర్వరసములును ఇందు పర్యాయముగా ఉండును. కోహలుడును ఇందుల కంగీకరించెను. అధమప్రకృతి నాయకుడుగా ఉండుటకు శంకుకుడు ఇష్టపడలేదు. కాని హాస్యరస ప్రధానములైన ప్రహసన-భాణాదులందు విటాదుల నాయకత్వమును ఆతడెట్లంగీకరించెను? ఏకాంకమనగా ఏకదివసప్రయోజ్యమైన ఇతివృత్తము కలదని అర్థము. ఇరువురు పాత్రలున్నప్పుడు ఉక్తి ప్రత్యుక్తి వైచిత్ర్య విశిష్టముగాను, ఒకేపాత్ర ఉన్నప్పుడు ఆకాశభాష సమన్వితముగాను కవులు స్వేచ్ఛతో రచింపవచ్చును. ముఖ-నిర్వహణ సంధులు రెండే ఇందుండును. వీథికి సంబంధించిన వక్రోక్త్యాది సంకులములైన త్రయోదశాంగములును నాటకాది సర్వరూపకములందును ఉపయుక్తము లగుటచే, ఇది వానికి వైచిత్ర్యము నాపాదించుచున్నది. అందుచేతనే ఇది అంతమునందు వివరింపబడినది. ఇది వక్రోక్తి సహాస్ర సంకులమగుటచే శృంగారహాస్యములు సూచనామాత్రముగా ఉండును. అందుచే ఇది కైశికీవృత్తిహీనముగా ఉండును. ఇందు బహువిధములైన వక్రోక్తి విశేషములు ఉత్తమ-మధ్యమ-అధమనాయకులయెడ ప్రయుక్తము లగుచుండును. [నాట్యదర్పణము - పుటలు 132-133]

శారదాతనయుడు : వీథియందు ముఖ-నిర్వహణ సంధులు రెండే ఉండును. ఇందలి వృత్తి కైశికి. ఇది ఇరువురు పాత్రలచే ప్రయుక్తము కావలెను. ఎప్పుడేని ఒకేపాత్రచే ప్రయుక్తము కావచ్చును. అంగి (ప్రధాన) రసమైన శృంగారము సర్వరస స్పర్శిగా ఉండును. లాస్యాంగ-వీథ్యంగములిందుండవలెను. ఇందు లాస్యాంగములు లేకపోయినను దోషములేదని కోహలుని అభిప్రాయము; కాని ఇది శృంగారరూపమగుటచే ఇందు లాస్యాంగములు తప్పక ఉండవలెనని భోజరాజు అభిప్రాయము. ఇందు ఒకే అంకము ఉండును. రసము (శృంగారము) అధికముగా సూచితము కావలెను. వకుళవీథి, ఇందులేఖాదు లిందుల కుదాహరణములు. [భావప్రకాశము - పుట 251]

విద్యానాథుడు : వీథియందలి అంగముల క్లృప్తి భాణమునందువలెనే. ఇందలి వృత్తి కైశికి. శృంగారమును పరిపూర్ణముగా అత్యధికముగా సూచింపబడవలెను. ప్రస్తావనలో చెప్పబడిన ఉద్ఘాత్యకాద్యంగము లిందుండవలెను. వీథివలె ఉండునుకాన ఇది వీథి అనబడినది. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతయగు

కుమారస్వామి శింగభూపాలుని అభిప్రాయములను కూడ ఇట ఉల్లేఖించెను. [ప్రతాపరుద్రీయము - నాటక ప్రకరణము]

విశ్వనాథుడు : వీథియందు ఒకే అంకము ఉండును. ఉత్తమ - మధ్యమ - అధములలో ఎవడో ఒకడు నాయకుడుగా కల్పింపబడును (అనగా ఇందు ఒకే పాత్ర ఉండును). ఆకాశభాషితములచే చిత్రమయిన ప్రత్యుక్తిని ఆశ్రయించి ఉండును. శృంగారమును అధికముగాను, ఇతర రసములను తక్కువగాను సూచింపవలెను. ముఖ - నిర్వహణ సంధులు రెండును, అర్థప్రకృతులన్నియును ఇందుండును. శృంగార బహులమగుటచే కైశికీవృత్తియును బహులముగా ఉండును. ఇందు త్రయోదశాంగములుండునని విద్వాంసులు చెప్పుదురు— ఈ అంగములు నాటకాదులందు కూడ ఉండును. నిస్పష్టములుగా నిరూపితములు కూడ అగుచుండును. అయినను వీథియందు ఇవి అవశ్యనిబంధనీయములు ; తక్కినవానియందు నియతత్వము లేదు. అందుచే ఇవి వీథియందే ఉదాహృతములైనవి. నానారసములు ఇందు మాలారూపముగా ఉండును కాన ఇది వీథి అనబడినది. 'మాలవికా వీథి' ఇందులకుదాహరణము [సాహిత్య దర్పణము-6వ పరిచ్ఛేదము-శ్రీ వేదంవారి అనువాదము _ సూ. 520, 521, 532]

శింగభూపాలుడు : వీథియందు శృంగారరసము ప్రధానము. ముఖ - నిర్వహణసంధులు రెండే ఇందుండును. అధికముగా కైశికీ వృత్తి ఉండును. ఇది ఏకపాత్ర ప్రయోజ్యము, లేదా ద్విపాత్ర ప్రయోజ్యమును, వీథ్యంగ సహితమును, ఏకాంకమును అగును. ఇందు ప్రాయికముగా లాస్యాంగములను ఉంచిన ఉంచవచ్చును. లేదా మానవచ్చును. ఇందలి నాయిక అనురాగ సహితయైన సామాన్యకాని, పరకీయకాని కాదగును. వీథ్యంగము లధికముగా గల వస్తువగుటచే ఇందు కులపాలిక నాయిక కారాదు. ఈ నాయికా విషయమును వివరించు (ఈ శ్లోకములను పేరుచెప్పకయే కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానమునందు ఉదాహరించెను) మాధవీవీథిక మున్నగునవి ఉదాహరణములు.

## వీథీలక్షణము

పై లక్షణ కర్తలు చెప్పిన వివిధాంశములను క్రోడీకరించి సమగ్ర వీథీ లక్షణమును కూర్చుటకు ప్రయత్నింతును—

1. పాత్రలు : ఒక పాత్రచేకాని, ఇరువురు పాత్రలచేకాని ప్రయుక్త మగునని భరతుడు చెప్పెను. అర్వాచీనాలంకారికులలో అధికులు దీనినే అనువదించిరి. ఒకే పాత్రచే ప్రయుక్తము కావలెనని విశ్వనాథు డభిప్రాయ పడెను, సాధారణముగా ఇరువురిచే, ఎప్పుడేని ఒకరిచే ప్రయుక్తమగునని శారదాతనయుడు పేర్కొనెను. సాగరనంది మాత్రము ముగ్గురు పాత్రలుందు రని చెప్పెను. ఏకపాత్ర ప్రయోజ్యమైనప్పుడు ఆకాశ పురుషభాషితసహిత ముగా సంభాషణము సాగును. ద్విపాత్ర ప్రయోజ్యమైనప్పుడు ఉక్తి-ప్రత్యుక్తి వైచిత్ర్యము సహితముగా సంభాషణము సాగును. అప్పుడు కూడ ఆకాశ భాషితములుండును. ఈ ఉక్తి - ప్రత్యుక్తులు వక్రోక్త్యాది సహస్ర సంకుల ముగా ఉండునని హేమచంద్రుడును, నాట్యదర్పణకారులును పేర్కొనిరి.

2. రసములు : ఇందు శృంగారను అంగిరసము. ఇది అధికముగా సూచితము కావలెనే కాని పూర్ణముగా పోషింపబడరాదు. తక్కిన రసము లిందు అంగరసములుగా ఉండును. కావున వీథి సర్వరస సంపన్నమని అందరును అంగీకరించియున్నారు. నాట్యదర్పణకర్తలు శృంగారముతోబాటు హాస్య మును కూడ జోడించుట గమనార్హము. రసములు పర్యాయముగా ప్రధాన ములు కావచ్చునని అభినవగుప్తుడే చెప్పెను.

3. వృత్తి : వీథి శృంగార బహుళమగుటచే ఇందు కైశికీ వృత్తి అధిక ముగా ఉండునని ధనంజయ - శారదాతనయ - విద్యానాథ - విశ్వనాథ - శింగభూపాలురు పేర్కొనిరి. భరత - అభినవగుప్త - సాగరనంది - హేమ చంద్రులీ ప్రశంస ఇచ్చట చేయనేలేదు. నాట్యదర్పణ కర్తలు మాత్రము ఇది వక్రోక్తి సహస్ర సంకులమగుటచేతను, శృంగార - హాస్యములు సూచనా మాత్రములగుటచేతను కైశికీవృత్తిహీనముగా ఉండునని చెప్పిరి. 'వీథీ కైశికీ వృత్తి బహుళ' మనుట అధికజన సమ్మతమని చెప్పవచ్చును.

4. నాయకుడు : ఉత్తమ - అధమ - మధ్యమ ప్రకృతులలో ఎవరైనను ఒకరు ఇందు నాయకుడు కావచ్చునని పై లక్షణకర్తలందరును అంగీకరించి యున్నారు. భరతునకు ఇంచుమించుగా సమకాలికుడుగా తలంపబడుచున్న కోహలుడు కూడ దీని నంగీకరించెను. కాని నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలలో ఒకడగు శంకుకుడు మాత్రము అధముడు నాయకుడగుటకు అంగీకరించలేదు. ఇందులకు అభినవగుప్తుడును, నాట్యదర్పణ కర్తలును సమాధానము చెప్పి యున్నారు.

5. నాయిక : సాగరనంది ఉత్తమ - మధ్యమ - అధమ నాయికా భూషితమై, చిత్ర ప్రకృతి యుతమై ఉండునని పేర్కొనుటను బట్టి ఉత్తమ - మధ్యమ - అధములలో ఇందు నాయకు డెట్టివాడగునో, నాయికయు అట్టిదియే అగునని గ్రహించవచ్చును. నాయికా విషయమునుగూర్చి శింగభూపాలుడు మాత్రము స్పష్టముగా ప్రసంగించియున్నాడు. ఇందు సామాన్య కాని, పరకీయ కాని నాయిక కావచ్చును; కులపాలిక మాత్ర మెన్నడును నాయిక కారాదు.

సాగర నంది - శింగభూపాలురు తప్ప తక్కినవారెవ్వరును నాయికా విషయమును వివరించనేలేదు. ఏకహార్యమయినప్పుడు నాయిక రంగము మీదకు వచ్చుటకే వీలులేదు. ద్విహార్యమన్నప్పుడు కూడ నాయకసహాయులై విదూషకాదులే రంగము మీదకు వత్తురు కాని నాయిక వచ్చుటకు వీలులేదు. ముగ్గురు పాత్ర లుందురన్నప్పుడుమాత్రము నాయిక రంగము మీదకన్పట్టి వచ్చును. కాని సాగరనంది పేర్కొనిన వకులవీథికా స్వరూప మెట్టిదో తెలియదు.

6. అంకము : వీథి యందు ఒకే అంకము ఉండునని అందరును అంగీకరించిరి.

7. ఇతివృత్తము : ఏకాంకమనుటచే ఇతివృత్తము సంక్షిప్తముగా ఉండవలెనని హేమచంద్రుడు స్పష్టముచేసెను. అంకమునందలి కథ ఒకదినములో జరిగినది కావలెనని భరతుడు చెప్పియుండెను. అందుచే వీథియందు ఏకదివస ప్రయోజ్యమైన (ఒక దినములో జరిగిన) ఇతివృత్తమును కూర్చవలయునని రామచంద్ర - గుణచంద్రాదులు పేర్కొనిరి. ఇందలి ఇతివృత్తము కల్పిత మనుట స్పష్టము.

ఇందు బీజ - బిందు - కార్యము లనెడి అర్థప్రకృతులు మూడే ఉండునని సాగరనంది చెప్పెను. విశ్వనాథుడు మాత్రము అర్థప్రకృతు లైదును ఉండునని చెప్పెను. అనగా పై మూడే కాక పతాకా - ప్రకరులు కూడ ఉండునన్నమాట. పతాకా - ప్రకరులు ప్రాసంగికేతివృత్తమునకు సంబంధించినవి. దీనిని వీథియం దితరులు అంగీకరించినట్లు కన్పట్టదు.

విభూషణాది 36 కావ్యలక్షణములును, తత్సాహచర్యము వలన గుణాలంకారములును ఇందు ఉండునని హేమచంద్రుడు పేర్కొనెను. లక్షణములు తరువాతి కాలములో అలంకారములుగా మారిపోయినవి. ఇంక గుణ - అలంకారములుగా మారిపోయినవి. ఇంక గుణ-అలంకారములు లేని కావ్య-నాట్య

రచనయే ఉండదు కాన వానిని ప్రత్యేకించి ఇతరులు చెప్పలేదని ఊహించవచ్చును.

8. సంధులు : వీథియందలి సంధులను గూర్చి భరత-అభినవగుప్తులిచ్చట ప్రత్యేకించి చెప్పకపోయినను, రెండే సంధు లుండునని 19 వ అధ్యాయమందు చెప్పియుండిరి. సంధి - అంగ - అంకములను భాణమునందు వలెనే కూర్చవలెనని ధనంజయుడు పేర్కొనెను. అనగా సాంగములైన ముఖ - నిర్వహణ సంధులు రెండే ఇందుండును. తక్కినవారందరును దీనినే అనువదించిరి. ముఖ సంధ్యంగములు పదుమూడు —ఉపక్షేపము, పరికరము, పరిన్యాసము, విలోభనము, యుక్తి, ప్రాప్తి, సమాధానము, విధానము, పరిభావన, ఉద్భేదము, కరణము, భేదము, విలాసము, నిర్వహణ. సంధ్యంగములు పదునాల్గు—సంధి, నిరోధము, గ్రథనము, నిర్ణయము, పరిభాషణము, ద్యుతి, ప్రసాదము, ఆనందము, సమయము, ఉపగూహనము, భాషణము, పూర్వవాక్యము, కావ్యసంహారము, ప్రశస్తి.

9. లాస్యాంగములు : వీథియందు లాస్యాంగము లుండవలెనని శారదాతనయుడు చెప్పినాడు. ఉండిన ఉండవచ్చునని కోహలు డభిప్రాయపడగా వీథి శృంగారప్రాయమగుటచే లాస్యాంగములు అవశ్యముగా ఉండవలెనని భోజుడు నిర్దేశించెనట. శింగభూపాలుడు కోహలుని అభిప్రాయమునే అనువదించెను. లాస్యాంగములు పది. కొందరు లాస్యాంగములు పన్నెండని చెప్పుదురు- గేయపదము, స్థితపాఠ్యము, ఆసీనము, పుష్పగండిక, ప్రచ్ఛేదకము, త్రిమూఢకము, సైంధవను, ద్విమూఢకము, ఉత్తమోత్తమకము, ఉక్తప్రత్యుక్తము, (చిత్రపదము, భావికము).

10. వీథ్యంగములు : వీథియందు త్రయోదశాంగము లుండవలెనని అందరును చెప్పినారు. ఇవియే వీథ్యంగములనబడును. కాని, అంగములను చెప్పిన వరుసయందును, కొన్ని నిర్వచనములందును లక్షణకర్తలలో భేదాభిప్రాయములు కన్నట్టుచున్నవి. నాట్యశాస్త్రమందు పదమూడంగముల పేర్లను క్రిందివరుసలో నిర్వచింపబడినవి— ఉద్ఘాత్యక-అవలగిత-అవస్పందిత-నాడీ-అసత్ప్రలాప-వాక్కేళీ-ప్రపంచ-మృదవ-అధిబల-ఛల-త్రిగత - వ్యాహార - గండములు. దశరూపకమందలి వరుస ఇంకొక విధముగా ఉన్నది— ఉద్ఘాత్యక-అవలగిత-ప్రపంచ-త్రిగత-ఛలన-వాక్కేళీ-అధిబల - గండ-అవస్యందిత - నాళికా-అసత్ప్రలాప-వ్యాహార-మృదవములు. దశరూపకమందలి వరుసను శారదా

తనయ-విద్యానాథ-విశ్వనాథ-శింగభూపాలురు అనుసరించియున్నారు. తక్కిన వారి వరుసలు ఇంకను భిన్నములుగా ఉన్నవి. నాట్యశాస్త్రమునుండి వీథ్యంగముల లక్షణములను పేర్కొనుచున్నాను.

ఉద్ఘాత్యకము— ఆదరసహితములును, ప్రశ్నరూపములును అగు పదములకు తత్పర్యాయములైన పదములతో సమాధానముచెప్పుట 'ఉద్ఘాత్యక' మనబడును. కాగా ఉద్ఘాత్యకము ప్రతివచనాత్మకమైనది.

అవలగితము— ఒక విధమగు ప్రశ్న కొసంగబడిన సమాధానము మరియొక కార్యమును (అర్థమును) సాధించుట 'అవలగిత' మనబడును.

అవస్పందితము— దైవికముగావచ్చిన ఒక అర్థమును కప్పిపుచ్చి వేరొక అర్థము వచ్చునట్లుగా సమాధానము చెప్పుట 'అవస్పందిత' మనబడును.

నాళిక— ఇతరులను వంచించునదియును, హాస్యసంయుక్తమును అగు సమాధానము 'నాళిక' అనబడును.

అసత్ప్రలాపము— విద్వాంసుడు చెప్పిన సమాధానము హితమైనదైనను ఛలమువలన (మూర్ఖతచే) మూర్ఖుడు దానిని హితముగా గ్రహింపక పోవుట 'అసత్ప్రలాప' మనబడును.

వాక్కేళి— రెండు లేదా అంతకుమించిన ప్రశ్నలకు ఒకే సమాధానమొసంగుట 'వాక్కేళి' అనబడును.

ప్రపంచము— అసత్యములును, పరస్పర సంస్తవయుక్తములును, హాస్యజనకములును, ఒకే ప్రయోజనమును సాధించునవియును అగు సమాధానములు 'ప్రపంచ' మనబడును.

మృదవము— కథా ప్రసక్తిలో కలిగిన వివాదము హేతువుగా, గుణములను దోషముగా, దోషములను గుణములుగా నిరూపించెడి సమాధానములను చెప్పుట 'మృదవ' మనబడును.

అధిబలము— స్వపక్ష బలసాధనమునకై ఉక్తి-ప్రత్యుక్తులు రెండును సాగుట 'అధిబల' మనబడును.

ఛలము- ప్రయోజనాంతరమును, ఉద్దేశించిన సమాధానము ఒకరికి దోషజనకమును, మరియొకరికి హాస్యజనకమును, ఇంకొకరికి అభిసంధి జనకమును అగుట 'ఛల' మనబడును.

త్రిగతము— ఒకే ప్రతివచనమునకు శబ్దసారూప్యముచేతను, కావ్యాదుల చేతను అనేకార్థములు తోచుట 'త్రిగత' మనబడును. ఇది హాస్యసహితము లేదా హాస్యరహితము కావచ్చును.

వ్యాహారము—భావికాలమందు ప్రత్యక్షముకాబోవు అర్థమును దైవవశమున స్ఫురింపజేయు సమాధానము 'వ్యాహార' మనబడును. ఇందు హాస్యలేశము ఉండవచ్చును.

గండము— సంరంభకృతమైన ఆవేగము, వివాదము, అపవాదము అనువానిచే ఈయబడిన ఈషదసమాప్త సమాధానము 'గండ' మనబడును.

ప్రశ్న— ప్రతివచనములకు అన్యాభిప్రాయరూపమగు సంబంధముచే కలుగు వైచిత్ర్యము 'వీథ్యంగ' మనబడును. లక్షణ-అలంకారాదుల కిట్టి ఉక్తి నియతమగు రూపము లేదు. కావున, ఉక్తి నియతమగు వైచిత్ర్యము కల వీథ్యంగములు పైవానికంటె భిన్నములగుచున్నవని తెలియవలెను. మరియు వీథ్యంగములందు హాస్యాంశ తప్పక ఉండుననియు, వీథ్యంగములు ప్రహసనమునందు కూడ ప్రయుక్తమగుటకు కారణమిదియే అనియు గ్రహించవలసి యున్నది. వీథ్యంగమనునప్పుడు 'అంగ' మనగా ఒక అంశము లేదా భాగమని అర్థము చెప్పుటకంటె 'ఒకవిధము' అని అర్థము చెప్పుట సమంజసము. కావున వీథ్యంగములనగా వీథీ భేదములని అర్థము. అట్లే లాస్యాంగము లనునప్పుడు కూడ లాస్యము యొక్క అంగములని కాక 'లాస్యము అంగముగాకలవి' అను అర్థమును చెప్పవలసియున్నది. కావున లాస్యాంగమనగా శృంగారాభినయముతో కూడినదై సాధారణముగా ఏకపాత్రహార్యమగు అభినయవిశేషమని అర్థము.

వీథ్యంగములు వీథియందు ముఖ్యములైనట్లే, లాస్యాంగములు 'భాణము' నందు ముఖ్యములు. అయినను ఇవి తక్కిన రూపకములందు కూడ ప్రయుక్తములగుచుండును.

## వీథీపద నిర్వచనము :

"ఇందలి ఉక్తి-ప్రత్యుక్తులు పంక్తివలెఉండును కాన ఇది వీథి అనబడినది" అని అభినవగుప్తుడభిప్రాయపడెను. "వీథీవ ద్వీథీమార్గః అంగానాం పంక్తిర్వా" అని ధనికుడును, "వక్రోక్తిమార్గేణ గమనాత్ వీథీవ వీథీ" అని నాట్యదర్పణకర్తలును, నానారసానాం చాత్ర మాలారూపతయా స్థితత్వా

ద్వీథీ యమ్" అని విశ్వనాథుడును వీథీపదమును నిర్వచించినారు. ఇవి అన్నియును ఇంచుమించుగా ఒకే రకముగా ఉన్నవి. అయినను అర్థము స్పష్టముగా లేదు. ఈ పదమునకు సరియైన అర్థము విస్మృతమైనదేమో అని తలంపవలసివచ్చుచున్నది. అభినవగుప్తుడు చెప్పినట్లు అన్యోన్యోత్తరాసహిష్ణువులైన అంగములు మాలగా లేదా పంక్తిగా ఇందుండుట ముఖ్యము.

## సంస్కృతసాహిత్యమందలి వీథులు :

నాట్యశాస్త్రమందు వీథికి గాని, వీథ్యంగములకుగాని ఉదాహరణములు లేవు. అభినవగుప్తుడు వీథ్యంగములకుదాహరణములొసంగెను; కాని, అవి అన్నియును నాటకాదులనుండి గ్రహింపబడినవే. వీథికి ఉదాహరణమును పేర్కొనిన ప్రథముడు సాగరనందియే. అతడు వీథీనిర్వచన సమయమున 'వకులవీథిక' ను 'అంచిత' (ప్రపంచ) మనెడి వీథ్యంగమును నిర్వచించునప్పుడు 'రాధావీథి'ని పేర్కొనెను. భోజుడు 'మాలతికావీథి'ని, దశరూపకమున కింకొక వ్యాఖ్యాత అయిన బహురూపమిశ్రుడు మాలతికా-ఇందులేఖా-వకుళవీథీ-కామదత్తలనెడి వీథులను పేర్కొనెను. మాలతికావీథినుండి బహురూపమిశ్రుడు కొంతభాగమునుదాహరించెను. (ఈ భాగమునే 'విక్రమోర్వశీయమునుండి' అని ధనికుడు తప్పుగా పేర్కొనెను)[2]

శారదాతనయుడు మొదట 'వకులవీథిక'ను పేర్కొని, పిమ్మట 'ఇందులేఖాదులు' కూడ ఉదాహరణములే అనెను. విశ్వనాథుడు 'మాలవికావీథి'ని, శింగభూపాల - కుమారస్వాములు మాధవీ వీథిని పేర్కొనిరి.

మొత్తమునకు వకులవీథిక, ఇందులేఖావీథి, మాలతికావీథి (ఇదియును మాలవికావీథియును ఒకటియే కావచ్చును), రాధావీథి కామదత్తావీథి అనెడు ప్రాచీనములైన ఐదు వీథులపేర్లు మాత్రమే మనకు తెలియుచున్నవి. ఈ ఐదు వీథులును అలభ్యములే; అందుచే వాని స్వరూపములు తెలియవు. అందుచే వీథీరచన చాల అరుదుగా జరిగినదని చెప్పవచ్చును. 'రూపకషట్క'మను పేర ఆరు రూపకములను (వ్యాయోగ-సమవకార-ఈహామృగ-డిమ-భాణ-ప్రహసనములు) రచించిన వత్సరాజుకూడ (క్రీ. శ. 12 వ శతాబ్ది చివరిభాగము) వీథిని

2. బహురూపమిశ్రుని వ్యాఖ్య అముద్రితము—డా. వి. రాఘవన్‌గారి "Bahurupa Misra's Commentary on Dasarupaka" అనెడి వ్యాసమును చూడవలెను. Journal of the Oriental Research, Madras.

రచింపకపోవుట విచారకరము. మొత్తముమీద వీథీలక్షణమును సరిపోల్చి చూచుకొనుటకు మనకు ప్రాచీనమైన సంస్కృత వీథిఒక్కటియును లభించక పోవుట దురదృష్టము.

మాలతికావీథినుండి ఒక భాగమును బహురూపమిశ్రు డుదాహరించి యుండెనని తెలిపియున్నాను. నాట్యదర్పణ కర్తలును, శారదాతనయుడును త్రిగతమున కుదాహరణముగా 'ఇందులేఖా' వీథినుండి ఒక శ్లోకమును ఉదాహరించి యున్నారు—రాజా : వయస్య !

"కింను కలహంసనాదో మధురో మధుపాయినాం ను ఝంకారః।
హృదయగృహదేవతా (హృదయగత వేదనా-భావప్రకాశపాఠము)
యా స్తస్యా ను సనూపురశ్చరణః॥

ఇట్టివే మరికొన్ని ఉదాహరణము లుండవచ్చును.

## లీలావతీ వీథి :

కేరళ దేశవాసియగు రామపాణివాదు డనెడి అర్వాచీన రచయిత రచించిన 'లీలావతీ వీథీ' అనెడి వీథిరూపకముయొక్క ముద్రితప్రతి ఒకటి నాకు లభించినది. ఈ రామపాణివాదుడు 'చంద్రిక' అనెడి ఇంకొక వీథినికూడ రచించెనట. అందులో వీథీలక్షణమును క్రిందివిధముగా నొసంగెనట. ['Introduction to Lilavati'—Travancore University Series No. 14]

పాత్రద్వయప్రయోజ్యా భాణవదేకాంకికా ద్విసంధిశ్చ ।
ఆకాశభాషితవతీ కృత్రిమ మితివృత్తమాశ్రితా వీథీ ॥

ఈ నిర్వచన మెందులోనిదో తెలియదు. వీథీరూపక రచనమందిష్టముకల ఆతడే దీనిని రచించియుండవచ్చును.

ఈ లీలావతీ వీథియందు మూడుభాగము లున్నవి—ఒకటి నటీ-సూత్రధారసంభాషణరూపమైన ఆముఖము. రెండు విష్కంభము-ఇందు విదూషకుడగు వైహాసికుడు లీలావతీ ప్రియసఖియగు కేళిమాలలో సంభాషించుట నిరూపితము. కేళిమాల రంగస్థలముమీదకు రాలేదు. ఆమె సమాధానము లన్నియును ఆకాశ పురుష భాషితములే. ఇంక మూడవ భాగము అసలు రూపకము. ఇందు రాజగు వీరపాలుడు, చెలికాడగు వైహాసికుడు ఇరువురు మాత్రమే రంగస్థలము మీదకు వత్తురు. తక్కిన పాత్రల మాటలన్నియును ఆకాశభాషితములే. విదూషకుని ఉపాయముతో వీరపాలునకు లీలావతి

లభించుటయే ఇందలి కథ. నాయకుడు ఉత్తము డగుట స్పష్టము. నాయిక కన్య యగుటచే శింగభూపాలుని నిషేధము ఇందు పాటింపబడలే దనవచ్చును. మొత్తమున కిందు తక్కిన వీథీ లక్షణము లన్నియును పట్టియున్నవి. ఇందలి ఇతివృత్తము మాత్రము సంస్కృత నాటికలయందలి (రత్నావళీ మొ.) ఇతివృత్తములను పోలియున్నది.

## వీథి : భారతీవృత్తి

వీథిని ప్రత్యేకరూపకముగానేకాక భారతీవృత్త్యంగముగాకూడ భరతుడు మొదలగు లాక్షణికులందరును పేర్కొనియున్నారు. వాగ్వ్యాపారము ప్రధానముగాఁ గలదియును, పురుషప్రయుక్తమును, సంస్కృత ప్రాయమును, భూమికాధారణముచేయని భరతులచే (నటులచే) ప్రరోచనాదులందు ప్రయుక్తమగునదియును'భారతీవృత్తి'అనబడును. ప్రరోచన, ఆముఖము, వీథి,ప్రహసనము అనెడి భారతీవృత్త్యంగములు నాలుగింటిలోను వీథి ఒకటి. దశరూపకములను వివరించునప్పుడే వీథీ-ప్రహసనములను వివరించియున్నానని చెప్పి, ప్రరోచనా-ఆముఖము (ప్రస్తావన) లను మాత్రమే ఈ సందర్భమున భరతాదులు నిర్వచించియున్నారు. ధనంజయాదులు ప్రస్తావనను వివరించునప్పుడే వీథ్యంగములను కూడ వివరించి, వీథీ నిర్వచన సమయమున వానిని అనుసంధించుకొనవలెనని సూచించియున్నారు. ప్రస్తావనాంగములైన కథోద్ఘాత-అవలగితములు రెండును వీథ్యంగములు కూడ అగుటచే వానిని వివరించునప్పుడే తక్కినవి కూడ వివరింపబడెనని తెలియవలెను. ప్రస్తావనాంగములైన ఉద్ఘాత్యక - అవలగితములు పాత్రప్రవేశసూచనార్థము ప్రయుక్తములగును. ఇంక వీథ్యంగములైన ఉద్ఘాత్యక - అవలగితములకు అట్టి ప్రయోజనము నియతము కాదు ; తక్కిన వీథ్యంగములవలె అవియును ఉక్తి-ప్రత్యుక్తి వైచిత్రి సహితములుగా ఉండును.

ప్రస్తావనాంగములు ఐదనియు (ఉద్ఘాత్యక-కథోద్ఘాత-ప్రయోగాతిశయ-ప్రవృత్తక-అవలగితములు) వానిలో ఉద్ఘాత్యక-అవలగితములు వీథ్యంగములందే (వీథీ నిర్వచన సమయమందే) నిర్వచింపబడెననియు, కావున తక్కిన మూడింటినే వివరించుచున్నాననియు భరతుడు చెప్పెను. కాని, ఉద్ఘాతక-ప్రవృత్తక-ప్రయోగాతిశయములు మూడే అసలు ప్రస్తావనాంగము లనియు, వీథ్యంగములు పదుమూడనియు, వీథ్యంగములు ప్రస్తావనాంగములుకూడ అగుననియు ధనంజయుడు పేర్కొనెను. మొత్తము పదునాలును ప్రస్తావనాంగ

ములే అని శారదాతనయుడు నిర్దేశించెను. విద్యానాథుడు ప్రస్తావనయందే వీథ్యంగములను నిర్వచించెను. విశ్వనాథుడు వీథిని భారత్యంగముగా పేర్కొనియు, అంగములను మాత్రము వీథీరూపక నిర్వచనమందే వివరించెను. ఇంక శింగభూపాలుడు క్రింది విధముగా పేర్కొనుట గమనార్హము...

"ప్రస్తావన, స్థాపన అని ఆముఖము రెండు విధములు. సూత్రధారుడు విదూషక-నటీ-పారిపార్శ్వకులతో కూడి సంభాషించుచు కొంచెపు వీథ్యంగము లతోడి ఆముఖాంగములను కూర్చునది ప్రస్తావన అనబడును. సమస్తములగు ఆముఖాంగములతోను, వీథ్యంగములతోను కూడిన వాక్యవిస్తరముతో సూత్రధారుడు నట నటీ విదూషకులతో సంభాషించుచు ప్రస్తుతమగు అర్థమును వెల్లడించునది స్థాపన. శృంగార రసప్రాయము లగు నాట్యములందీ రెండు రకములును ఉండును; ఉదా: రత్నావళి మొ. వీరాద్భుత ప్రాయములగు నాట్యములందు ప్రస్తావన తగినది; ఉదా: అనర్ఘ రాఘవాదులు. హాస్య - బీభత్స - రౌద్రాదులు గల నాట్యములలో స్థాపన ఉండును; ఉదా: వీరభద్ర విజృంభాదులు."

## వీథ్యంగములు : నాటకాదులు

వీథ్యంగములు నాటకాదులయందు కూడ కన్పట్టుననియు, విస్పష్ట ములుగా నిరూపితము లగుచుండుననియు, విశ్వనాథుడు స్పష్టముగా నిర్దేశించి యుండెను. వీథి సర్వరూపకోపయోగి అని అభినవగుప్తాదు లనుటలోని అర్థ మిదియే. వారొసంగిన వీథ్యంగోదాహరణము లన్నియును నాటకాదుల లోనివే అని తెలిపియున్నాను. మరియు ఇవి నాటకాదుల మధ్యలోనే కాక పైన చెప్పిన విధముగా అన్ని రూపకముల ప్రస్తావనలో కూడ కన్పట్టు చుండు నని తెలియవలెను. వీథి - ప్రహసనములు భారతీ వృత్త్యంగములని చెప్పినప్పుడు అవి రెండును యథాతథములుగా అచ్చట ఉండునని భావించరాదు. ఇచ్చట వీథి అనగా వీథ్యంగములనియును, ప్రహసనమనగా హాస్యాత్మకములైన సంభాషణములనియును గ్రహించవలసియున్నది.

దశవిధ రూపకములలోను నాటక - ప్రకరణములు ఉత్తమములు; అంతియే కాదు సమగ్రలక్షణసంపన్నములు. ఇవి రెండును రెండు శాఖలకు చెందిన రూపకములకు నాయకత్వమును వహించుచున్నవి. నాటకము వీర ప్రధానమైనది (heroic type). ఇంక ప్రకరణము సాంఘికేతి వృత్తముకలది

(social type). వీనిలో డిమాదులు నాటకమునకు మూలభూతములు కాగా వీథీ-ప్రహసనములు ప్రకరణమునకు మూలభూతము లగుచున్నవి. వీనిలో 'వీథి' అన్నింటికంటె ప్రాథమికమైన రూపక విశేషము. ఇందు అన్ని రసములు, అందరు ప్రకృతులు ఉండవచ్చును; ఇందలి విషయములు నిత్యజీవితమునకు సంబంధించిన సామాన్యవ్యాపారములు. ఏకపాత్ర ప్రయోజ్యమగు వీథి ద్విపాత్ర ప్రయోజ్యమగు వీథికంటె ముందరిదని చెప్పవచ్చును. ప్రహసనమందు రసము నియమితమైనది; శుద్ధ-సంకీర్ణ భేదములచే ఇది రెండు విధములు. సాంఘిక (కవిత్వ) విషయకము, హాస్యాత్మకము అనెడి రెండు గుణములతో కూడినదై ప్రకరణము నాటకమందలి సర్వలక్షణములను పుడికి పుచ్చుకొన్నది. మొత్తమునకు మూలభూతమైన వీథి మాత్రము, అంగముల మూలమున, ప్రకరణమందును, నాటకమందును నిలిచి ఉన్నదని గ్రహించవలెను. (దశరూపక పరిణామమును వివరించుట ఒక ప్రత్యేక వ్యాసము కాగలదు.) సారాంశమేమనగా ఈ వీథ్యంగములు రూపకముల మధ్య భాగములందును, ప్రస్తావనయందును కూడ నిబంధింపబడుచుండును.

ఇంకా వీథియందు అన్ని అంగములును తప్పక నిబంధింపబడునని వేరుగ చెప్పనక్కరలేదు కదా. అసలీ అంగములచేతనే వీథి యందలి ఇతివృత్తము పరిపోషితమగును.

ఇచ్చట ఇంకొక విషయమును కూడ గమనింపవలెను. వీథీ భాణములు రెండును సంభాషణప్రధానములనుట కంటె వర్ణనాప్రధానములనుట సమంజసము. ఈ సత్యమును బట్టి ఇవి ప్రాథమిక రూపకములనుటయు స్పష్టము కాగలదు.

## 2. క్రీడాభిరామము

ఇంతవరకును వీథీలక్షణమును సమగ్రముగా వివరించి యున్నాను. ఇంక ఈ లక్షణమును క్రీడాభిరామమునకు అన్వయించి అది వీథీరూపక మెట్లయినదో వివరింతును.

### ప్రేమాభిరామము

"ఆ మంత్రిశేఖరుండు (వల్లభామాత్యుడు) రావిపాటి త్రిపురాంతకదేవుండను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి

క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుబాస రచియించినవాడు" అని సూత్రధారుడు ప్రస్తావనలో చెప్పియున్నాడు. రావిపాటి త్రిపురాంతకుడు క్రీ. శ. 1350 ప్రాంతములందలి ఒక ప్రసస్తకవి వల్లభామాత్యుడు త్రిపురాంతకుని క్రిందివిధముగా ప్రశంసించి యుండెను. [క్రీడాభిరామము - 86 వ పద్యము]

ఉ. నన్నయభట్ట తిక్కకవి నాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూడి యమరాధిపుఁడన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు జేయని రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ.........

త్రిపురాంతక కవికృతములైన త్రిపురాంత కోదాహరణాది ఇతర గ్రంథములు లభించినవి కాని పై ప్రేమాభిరామము లభింపకపోవుట దురదృష్టము. క్రీడాభిరామము 'వీథి' అగుటచే దానికి మూలమైన ప్రేమాభిరామమును 'వీధి' అయిఉండునని ఊహించుట అసమంజసము కాజాలదు. అయినను పై సూత్రధార వాక్యములలోని 'ప్రేమాభిరామ నాటకంబును', 'అనుసరించి' 'క్రీడాభిరామంబను రూపకంబు' 'తెనుంగుబాస రచియించినవాడు' అనునవి పరిశీలనార్హములు. ప్రేమాభిరామము నాటకమట దానిని అనుసరించి క్రీడాభిరామము అనెడి రూపకము తెలుగు భాషలో రచింపబడినదట.

'ప్రేమాభిరామ నాటకంబు' అనుటలో 'నాటక' పదము అన్వర్థముగా ప్రయుక్తమైనదా లేదా అనునది విచారణీయాంశము. నాటకమనునది దశవిధ రూపకములలో ఒక ప్రధానభేదము. కాని అది రూపకము, నాట్యము అనెడి పదములకు పర్యాయపదముగా ప్రయుక్తమగుట కలదు; ఇందులకు నాట్యశాస్త్రమందే ఉదాహరణములు కలవు. అందుచే ఇచ్చటకూడ రూపకము అనెడి అర్థమందే ప్రయుక్తమైనదనుకొన్నను, అనుసరించి రచియింపబడెననుటను బట్టి క్రీడాభిరామము ప్రేమాభిరామమునకు కేవలానువాదము కాదనుట స్పష్టమగుచున్నది. ఇది కేవలానువాదము కాదనెడి విషయమును పేరు మార్పులోనే సూచించియున్నాడు కవి. అసలానాడు యథార్థానువాదమను నది తెలుగుకవులు ఆదరింపని విషయమని మరచిపోరాదు. మరి ఈ అనుసరణము వీథీరూపక స్వరూపమాత్రమే అగునో లేక ఇతివృత్తానుసరణము కతిపయ శ్లోకానువాదము కూడ జరిగినదేమో నిశ్చయముగా చెప్పజాలము. క్రీడాభిరామమందలి పద్యములతో సంవదించుచున్న మూడు శ్లోకములు పెదకోమటి వేమారెడ్డి 'సాహిత్య చింతామణి' (అముద్రితము) యందున్నట్లు శ్రీ వేటూరి

ప్రభాకరశాస్త్రిగారు కనుగొనియున్నారు. కాని అవి ఎచ్చటినుండి గ్రహింపబడెనో పెదకోమటి వేమారెడ్డి స్పష్టముగా చెప్పినట్లు లేదు.

## క్రీడాభిరామము

పై సూత్రధార వాక్యములలో క్రీడాభిరామము రూపకమని మాత్రమే కలదుకాని అది ఏవిధమగు రూపకమో చెప్పబడలేదు. తరువాతి పద్యములలో కూడ రూపకమనియే కలదు. కావ్యాంతమందలి గద్యలో "...సుకవిజన విధేయ వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామంబను వీథినాటకంబున సర్వంబు నేకాశ్వాసము" అని ఉన్నది. ఇంక గ్రంథ ప్రారంభమందు క్రిందివిధముగా కలదు—

"గణనకెక్కిన దశరూపకములయందు, వివిధ రసభావ భావన వీథిలెస్స
యే కవీంద్రుడు రచియించె నీ ప్రబంధ, మనుచు మీరానతిచ్చెదరైన వినుడు."

ఈ గ్రంథప్రారంభ పద్యమునుబట్టి ఇది వీథిగానే రచింపబడినదనుట స్పష్టము. కాని అందలి 'ప్రబంధ' పదము కొందరికి అనుమానము కలిగించవచ్చును. 'ప్రబంధ' మన్నచో ముఖ్యముగా తెలుగువారికి మనుచరిత్రాదులు స్ఫురించుచుండును. కాని ప్రబంధ పదమునకర్థము అంత మాత్రమేకాదు. 'ప్రబంధ' మనునది సర్వ గ్రంథవాచకము. భాగవత - రామాయణాదులు, నాటకములు మొదలగునవన్నియును ప్రబంధములే అనబడును. [చూ. శ్రీ పా. సుబ్రహ్మణ్యకవిగారి వ్యాసము— "పెద్దనయే ప్రథమాంధ్ర ప్రబంధ కర్తయా ?"—Journal of Sri Venkateswara Oriental Institute Vol. II No. 2] అందుచే ఇచ్చటి ప్రబంధమునకు కూడ నాటకము లేదా రూపకము అని మాత్రమే అర్థము. 'వీథినాటకము'[3] అనునప్పుడు 'నాటక' పదము రూపక పర్యాయపదముగా ప్రయుక్తమైనదని గ్రహించవలెను. ఇంక 'సర్వంబు నేకాశ్వాసము' అనుదానికి సమాధానము చెప్పవలసియున్నది. వీథీరూపకమును రచించుచున్నానని చెప్పిన గ్రంథకర్త 'ఏకాశ్వాస'మని వ్రాసి ఉండడు.

---

3. "........ఎనిమిదవ వీథియను నాటకంబునందుఁ గల్పిత మితి వృత్తంబును, ధీరోద్ధత నాయకుండును, రస సూచనా మాత్రంబునైయుండు" అనుచు చిత్రకవి పెద్దనార్యుడు 'లక్షణ సారసంగ్రహ' మందు వీథిని నిర్వచించుచు 'వీథియను నాటకము' అనుట గమనార్హము. ప్రాచీనాంధ్రాలంకారికులలో రూపక లక్షణములను వ్రాసిన వాడీతడొక్కడే. ఇతడు క్రీ. శ. 1550 ప్రాంతముల వాడని విమర్శకుల అభిప్రాయము.

'సర్వంబును ఏకాంకము' అని వ్రాసి ఉండునని విశ్వసించుచున్నాను. అంకమని వ్రాయుట ఆనాటి తెలుగు వ్రాయసగాండ్లకు క్రొత్త. తెలిసియో తెలియకయో వారు దానిని 'ఏకాంకము' అని మార్చి ఉందురనుటలో సందేహములేదు. వీథీ స్వరూపము వర్ణనాత్మకమగుటయు నిందులకు తోడుపడి ఉండును. అసలు, గద్య వ్రాయుటయు తెలుగు కవుల సంప్రదాయమే.

లక్షణ సమన్వయము

క్రీడాభిరామమందలి ఇతివృత్తమును, అందలి సన్నివేశములును అందరకును తెలిసినవే అనెడి భావముతో రచన సాగించుచున్నాను—

1. పాత్రలు: కాపల్నాటి గోవిందమంచనశర్మ, వాని కట్టనుంగు చెలికాడు టిట్టిభసెట్టి ఈ ఇరువురే ఇందలి ప్రధాన పాత్రలు, వారిరువురు అనేక విషయములను వర్ణించుచు పోవుచుందురు. వారు వర్ణించిన జక్కుల పురంధ్రి మొదలగు వారెల్ల రంగస్థలము మీదకు రానక్కరలేదు, లేదా ఆధునిక పద్ధతిలో (నేటి ఫాన్సీ డ్రెస్ పద్ధతిలో) ఆయా సందర్భములందు ఆయా వ్యక్తులు ఒక ప్రక్కనుండి రంగముమీద ప్రవేశించి, రెండవ ప్రక్కనుండి నిష్క్రమింప వచ్చును; మాటలాడనవసరములేదు. అంతమునందు గోవిందశర్మ ప్రియురాలు కామమంజరియును, పూజరిసానియు రంగముమీదకు వత్తురు. వారును మాటాడరు. కావున క్రీడాభిరామము ద్విపాత్రహార్యమగుచున్నది. ఇందు ఆకాశ పురుష భాషితములు కూడ కలవు.

3 రసములు: "గణనకెక్కిన దశ రూపకములయందు వివిధ రసభావ భావన వీథిలెస్స" అని కవియే చెప్పుట గమనార్హము. వీథి సర్వరస సంపన్న మగుటను గుర్తించి కవి ఈ అవకాశమును పూర్తిగా వినియోగించికొనినాడు. ఇందు ప్రధానమైనది శృంగారము. తక్కినరసము లాయా సందర్భములందు కలవు. ఇందలి శృంగారమంతయును పరకీయారతికి సంబంధించినదగుటచే ఇది ఆలంకారికముగా 'ఆభాస' మనబడును. దీనికి పరిపూర్ణపోషణము ఉండదు కాని అత్యధికముగా సూచింపబడుట జరిగినది.

3. వృత్తి: ఇచ్చట వృత్తి అనగా నాట్యావృత్తి అని తెలియవలెను. కావ్యవృత్తులు 'రసోచితార్థ సందర్భము' లై గుణములకు సన్నిహితములును, 'రసోచిత శబ్ద సందర్భము' లైన రీతులకు సమాంతరములును అగుచున్నవి.

కాని నాట్యవృత్తి కావ్యవృత్తికంటె కొంచెము భిన్నము. నాట్యవృత్తిని డా. రాఘవన్ క్రింది విధముగా వివరించెను—

"Natya is the imitation of action and each action has its characteristic mood or atmosphere or disposition; with respect to the man in action as well as to the Sahṛdaya who sees the Natya. This mood or atmosphere or disposition is vṛthi." [Journal of the oriental Research, Madras. Vol. VI. Part IV. P. 352] Guna will be the nature of the Rasa, Vṛthi, the nature of vastu or ideas or Itivṛtha; and Riti, the nature of the expression of the first and second in suitable words [Vol. VII. Part II. P. 104.]

క్రీడాభిరామమంతయును శృంగార విషయకమగుటచే ఇందలి నాట్యవృత్తి కైశికి అనియు, ఇతర రసములు ప్రసక్తములైనప్పుడు ఆ యా వృత్తులు కలవనియు చెప్పవచ్చును.

4. నాయకుడు : ఇందు గోవిందమంచనశర్మ నాయకుడు, అతడు కాసల్నాటి శ్రేష్ఠుడు, మాధవుని పట్టి, మీసాలప్పయ్యగారి మేనల్లుడు, ధాత్రీసుర తిలకుడు; అంతియే కాదు కుసుమశరాసనసముడు అయినను వీని బ్రాహ్మణ్యము జాతిమాత్రోపజీవ్యమును, ఇతడు జార రతిప్రియుడును అగుటచే ఇతడు అధమపాత్ర అగుచున్నాడు.

ఇంక వీని మిత్రుడు టిట్టిభసెట్టి వాని కంటెను సన్నాసి. మరియు ఇందు వర్ణింపబడిన విషయములెల్ల అనుదాత్తములే అని చెప్పవచ్చును.

5. నాయిక : ఇందలి నాయిక కామమంజరి. ఈమె పునర్భువు (మారుమనువుది). అందుచే నాయిక నాయకోచితగానే ఉన్నది.

6. అంకము : 'సర్వంబును ఏకాంకము' అని కవి వ్రాసిఉండునని ఇదివరకే చెప్పిఉన్నాను. మొత్తము ఇందు మూడుభాగములున్నవి—(1) కృత్యవతరణిక. ఇందు కావ్యపద్ధతిలో కవి వంశాదులు వర్ణితములైనవి. (2) ప్రస్తావన. దీనిని సూత్రధారుడొక్కడే నిర్వహించెను. (3) అసలు కథ. అంతమున భరతవాక్యమును పోలిన రెండు పద్యములు కలవు.

7. ఇతివృత్తము : కాకతీయ సార్వభౌముడగు రెండవ ప్రతాపరుద్రుని కాలమందలి ఓరుగల్లు పురము ఇందు వర్ణితమైనది. నాటి సాంఘిక పరిస్థితులు, జానపద జీవనము, సంఘ దురాచారములు, వినోదములు మున్నగునవి దీని వలన తెలియుచున్నవి. ఇందు కొన్ని చారిత్రకముగా సత్యములైనను మొత్తము

మీద ఇతివృత్తము మాత్రము కల్పితమైనదే. కార్యాంతరవ్యాసంగుడై దేశాంతరగతుడై కొంతకాలమునకు తిరిగివచ్చిన గోవిందమంచనశర్మ స్నేహితుడగు టిట్టిభసెట్టితో కూడి ఒకనాటి వేకువజామున ఓరుగంటిలో ప్రవేశించి మార్గమందలి, వీథులలోని వింతలను విశేషములను చూచుచు రాత్రికి గమ్యస్థానమును చేరెను. అతడచ్చట తమ్మడిసాని కూతుతోడి కూటమును కోమటి సంగడికానికి ఘటించి తాను తన ప్రియురాలగు కామమంజరితో ఆ రాత్రి సుఖముగా కాలముగడిపెను — ఇదియే ఇందలి కథావస్తువు. ఇట్లు గ్రంథారంభము ఉదయసూర్యస్తుతితోడను, గ్రంథాంతము చంద్రస్తుతితోడను ఒప్పుచుండుటచే ఇందలి ఇతివృత్తము ఏకదివసప్రయోజ్యమగుచున్నది. ఇతివృత్తము అల్పమగుట స్పష్టమే.

8. సంధులు : ఇతివృత్తమను పదమునకు అభినవగుప్తుడు రమ్యమగు అర్థమును చెప్పియున్నాడు—కవి శక్తిచే సంఘటింపబడిన, సర్వలక్షణసంపన్నమగు కథ మాత్రమే ఇతివృత్త మనబడును. క్రీడాభిరామమందలి కథ అట్టిది కాదు. అందుచే అర్థప్రకృతులను, సంధి సంధ్యంగములను నిరూపించుటకు తగినంత చిక్కదనము ఈ కథలో లేదు. లీలావతీ వీథియందలి కథకు ఈ కథ కేవలము భిన్నమైనది. నాయకభేదమును బట్టి ఈ భేదము కలిగినదని చెప్పదగును. మిత్రులిరువురు వేశవాటంబు దాటిపోవలెనని తలంచుటతో ముఖసంధి పూర్తి అగుచున్నది. తరువాతిది నిర్వహణ సంధి. శ్రీ తిరుమల రామచంద్ర గారు సంధి-సంధ్యంగ నిరూపణమును చేసియున్నారు ["అభ్యుదయ"—అక్టోబరు, 1958 చూడవలెను]

9. లాస్యాంగములు : ఇందు లాస్యాంగములను స్పష్టముగా రూపించుటకు వీలు లేకున్నను ఆయా వనితల విలాసగమనాదులు వర్ణితములైన చోటులందు లాస్యచ్ఛాయలు కలవని చెప్పవచ్చును.

10. వీథ్యంగములు : క్రీడాభిరామమునందు త్రయోదశ వీథ్యంగములను చక్కగా నిరూపించవచ్చును. అది ఒక ప్రత్యేక వ్యాసము కాగలదు. మంచెన శర్మ మధుమావతికి చెప్పిన సమాధానము (ఇది 'మృదవము') మొదలగునవి వీథ్యంగముల కుదాహరణములు.

పై విధముగా వీథీలక్షణములన్నియును క్రీడాభిరామమందు సమన్వయమగుచున్నవి. కావున క్రీడాభిరామము 'వీథి' అగుట స్పష్టము.

వల్లభామాత్యుడు

పాశ్చాత్య సాహిత్య ప్రభావము తెలుగుజాతిమీద పడునంతవరకును తెలుగుభాషలో స్వతంత్రరూపకరచనము కాని, సంస్కృత రూపకానువాదము కాని జరుగనేలేదు. కొందరాంధ్రకవులు సంస్కృతమందు నాటకాదులను రచించియున్నారు. కాని తెలుగున రచించుటకు పూనుకొనలేదు. సంస్కృత రూపకములను చేపట్టిన పిల్లలమర్రి పినవీరభద్రుడు, నందిమల్లయ-ఘంటసింగ యాదులు వానిని కావ్యములుగా మార్చిరే కాని నాటకములుగా అనువదింప లేదు. ఇందులకు కారణ మేది అయినను ఫలము మాత్రము విచారకారణ మగుచున్నది.

ఇట్టి స్థితిలో వల్లభామాత్యుడు ఒక గొప్ప సాహసకార్యమునకు పూను కొనెను. అదియే క్రీడాభిరామ రచనము. అది నిజముగా సాహసకార్యమే అని చెప్పుటకు క్రిందిసూత్రధార వాక్యములు బలమొసంగుచున్నవి. "ఆ మంత్రి శేఖరుడు.........క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగుబాస రచియించిన వాఁడు.

గీ॥ ఆతఁడెంతటివాఁడు ప్రేమాభిరామ, మనఁగ నెంతటియది దాని ననుసరించి
వీథియనురూపకము మదివెరపులేక, తిప్పవిభువల్లభుండెట్లు తెనుఁగుఁజేసె॰

అని యానతిచ్చెద రేని

ఉ॥ నన్నయభట్ట తిక్కకవినాయకులన్న......................
......................రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ తగునా యిటు దోసపుమాటలాఁడగన్.

గీ॥ జనని సంస్కృతంబు సకలభాషలకును,
దేశభాషలందుఁ దెనుఁగు లెస్స[4]
జగతి దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చు టాఁడుబిడ్డ మేలుగాదె."

దశవిధరూపములందును 'వీథి' తక్కువ రకము. దానిని రచించినవాడు త్రిపురాంతకుడు. తెలుగుభాష నాటకరచనమునకు తగదనుభావ మున్నదేమో

4. ఈ పాదము ఆముక్తమాల్యదయందును కలదు. అది దీనికంటె బహుళ ప్రచార మందున్న గ్రంథమగుటచే ఈ పాదమును మొదట చెప్పినవాడు కృష్ణదేవరాయలే అని భ్రమించుట కవకాశము కలిగినది. కాని నిజమ్మునకిది అంతకుముందే క్రీడాభిరామమందు కలదు.

ఆనాడు; ఆ సాహసకార్యమును చేసినవాడు వల్లభామాత్యుడు. కావుననే సూత్రధారుడు పైవిధముగా సమాధానము చెప్పుకొనవలసివచ్చినది.

క్రీడాభిరామ ప్రదర్శనమును గూర్చి రూపకాంతమున క్రిందివిధముగా కలదు—

క॥ నటులది దోరసముద్రము, విటులది యోర్గల్లు కవిది వినుకొండమహా
పుటభేదన మీత్రితయము, నిటఁ గూర్చెను బ్రహ్మరసికులెల్లను మెచ్చన్.

క్రీడాభిరామమును ప్రదర్శించినవారు దోరసముద్రపు నటులు; దీని యందలి ప్రధాన పాత్రలు (సెట్టి-శర్మలు) ఓరుగల్లువారు; రచించిన కవి వినుకొండ ప్రభువు. ఆనాటి దోరసముద్రపు నటులు రూపకప్రదర్శనములందు ప్రసిద్ధిగాంచియుండవలెను! క్రీడాభిరామమే ప్రథమాంధ్ర రూపకమైనచో మరి దోరసముద్రపు నటులు అంతకుముందు ప్రదర్శించునవి యక్షగానములు లేదా వీథినాటకములు అయి ఉండును. అంతకుముందు తెలుగులో ఏవిధమైన మార్గ రూపకరచనమును ఆదర్శముగా లేకపోవుటచే మొదటిదైన క్రీడాభిరామ రచన మందు యక్షగానములయందలి కథాకథన పద్ధతి కొంత అనుసరింపబడినదని చెప్పవచ్చును.

ఇచ్చట ఇంకొక విషయమును స్పష్టము చేయవలసి ఉన్నది. క్రీడాభిరామ సంపాదకత్వమును వహించినవారందరును అది ఒక రూపకవిశేషమను గుర్తుతో దానిని ముద్రించినట్లు కన్పట్టదు. ఉదా: "వ. ఆకర్ణించి సూత్రధారుడు హా! యేనెఱింగితి...అయ్యోరువురి యోగక్షేమంబు లనుసంధించెదంగాక" యని నిష్క్రమణ సమయమందు కలదు. దీనిని క్రిందివిధముగా ముద్రించినచో సమంజసముగా ఉండును—

సూత్రధారుడు: [ఆకర్ణించి] హా! ఏనెఱింగితి...అయ్యోరువురి యోగ క్షేమంబు లనుసంధించెదంగాక! [అని నిష్క్రాంతుడయ్యె.]

ఇది ప్రస్తావన.

ఇట్లే అచ్చటచ్చట కుండలీకరణాదులు పెట్టినచో దీనికి రూపకస్వరూపము కొంత రాగలదు. ఇంక తక్కిన కథాకథన పద్ధతి యక్షగానాదుల పోలిక అని గ్రహించవలెను.

పై రకముగా మార్పులు చేయుట అశాస్త్రీయమని కొందరాశంకింప వచ్చును. కాని అది నిలువదగిన ఆశంక కాదు. మన పండితులు ఎన్నెన్ని కవి

హృదయసమ్మతములైన పాఠములను మార్చి పారవేయలేదు ? నేను సూచించిన పద్ధతి అంతకంటె అధికదోషము కాజాలదు.

## కర్తృత్వము

కృత్యవతరణికలోను, సూత్రధార వాక్యములలోను, గ్రంథాంత గద్యలోను క్రీడాభిరామము వల్లభామాత్యకృతమనియే స్పష్టముగా, నిస్సందేహముగా పేర్కొనబడినది. మరియు లక్షణకర్తలైన చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన, శ్రీధరుడు, గణపురపు వేంకటకవి, జగన్నాథుడు అనువారిందలి పద్యములను 'వల్లభరాయల వీథినాటకమునుండి' అని పేర్కొని ఉదాహరించినట్లు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు పేర్కొనిరి.[5] [శ్రీ డాభిరామము పీఠిక-1909 ]

కాని, సులక్షణసారము, అప్పకవీయము, లక్షణదీపిక, సర్వలక్షణ సారసంగ్రహము మొదలగు లక్షణగ్రంథములందు శ్రీనాథుని వీధినాటకము లోనివిగా ఉదాహృతములైన పద్యము లీ క్రీడాభిరామమునం దుండుటచేతను, క్రీడాభిరామ మందలి పదసంవిధానము, అన్వయక్రమము, కారకప్రయోగ వైచిత్రి, పద్యోపక్రమ నిర్వాహములు ప్రతి పదము శ్రీనాథుని పేరుగ్గడించు చుండుటచేతను క్రీడాభిరామమును శ్రీనాథుడే రచించెననెడి వాదము బయలుదేరినది.

తొలిసారిగా క్రీడాభిరామమును 1909 లో ముద్రించిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు రెండు వాదములకును తగిన ఉపపత్తుల నొసంగి తాము మాత్రము శ్రీనాథునివైపే మొగ్గుచూపిరి. వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవుల చరిత్రలో (ప్రథమ సంపుటము-ద్వితీయ ముద్రణము) క్రీడాభిరామ కర్త వల్లభరాయడే అని సిద్ధాంతీకరించిరి. కాని, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు అది శ్రీనాథకృతమే అని నిరూపించిరి. తరువాత అనేకులు ఇరుపక్షములనుజేరి

---

5. కాని, "నేనెఱిగినంతలో లాక్షణికు లెవ్వరును క్రీడాభిరామ పద్యములను వల్లభరాయనిపేర నుదాహరింపలేదు. ప్రబంధరత్నాకరమనుపేర ప్రబంధ పద్యములను సంధానించిన పెదపాటి జగన్నాథకవి యొక్కడు మాత్రము (ఈతనిది లక్షణగ్రంథముగాదు) వల్లభరాయనిపేర, క్రీడాభిరామపద్యముల సేకరించినాడు" అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు. [క్రీడాభిరామము పీఠిక-1952] ఇందులో కొంత అతిశయోక్తి లేకపోలేదు. శ్రీ బండారు తమ్మయ్యగారి పీఠికను చూడవలెను [క్రీడాభిరామము పుట-10-11]

వాదోపవాదములను వెలయించిరి. ఈ వాదముల నన్నింటిని శ్రీ బండారు తమ్మయ్యగారు 1952 లో వావిళ్ళవారు ప్రకటించిన క్రీడాభిరామ పీఠికలో పేర్కొనియున్నారు. అందుచే నేనింక మరల పేర్కొనుటలేదు. శ్రీ తమ్మయ్యగారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వాదమును ఖండించి యున్నారు. శ్రీనాథుడు ధనాశచేతనో, మరెందుచేతనో క్రీడాభిరామ కర్తృత్వమును వల్లభరాయనికి అంటగట్టెనని భావించెడి శ్రీ శాస్త్రిగారు "ఎన్నఁటికివిగూడఁ గ్రీడాభిరామము శ్రీనాథకృతము గాదను వాదము పుట్టకుండుటకో యనునట్లు శ్రీనాథ కవి యనేక స్థలముల నిందుఁ దన తక్కిన గ్రంథముల రచనములను జేర్చెను" అని వ్రాయుట [వారి పీఠిక - పుట 12] నా కాశ్చర్యము కలిగించినది. అనగా శ్రీనాథుడు 'వట్టి దొంగ' అయి ఉండవలెనన్నమాట ఇంక "...వల్లభరాయఁడు శ్రీనాథుని బాల్యదశలో గొప్ప కవియైనట్లు తెలియుచున్నది. శైలి విషయమున సామాన్యమును జూపి శ్రీనాథునకుఁ గర్తృత్వమారోపింతమన్నచో నక్కాలపుఁ గావ్యములెల్ల నించుమించుగా సమాసపాటవమును గవితాధాటియును నిరంకుశభావములు గలిగియున్నవి. పినవీరభద్రుడు, శివలీలా విలాసము వ్రాసిన కొమ్మనయు, ఎలకుర్తి రామ రాజును, తులసి బసువనయు, అంగర నృసింహ కవియు రచించిన కావ్యములలో బిగువును ధారాపాతమును సమానముగా నున్నవి" అని శ్రీ రామకృష్ణ కవిగారు వ్రాయుట గమనార్హము. [వారి పీఠిక - పుట vi]

అప్రస్తుతమైనను నేటి కాలమునకు సంబంధించిన రెండు ఉదాహరణముల నొసంగుచున్నాను—(1) షేక్స్పియరు పెక్కు ఉత్తమ నాటకములను రచించిన మహాకవిగా పేరుపొందియున్నాడు. ఈ విషయమున కొన్ని శతాబ్దముల కాలమునుండియు ఎవరికిని ఎట్టి తీవ్రానుమానము లున్నట్లును కన్పట్టదు. కాని ఈ మధ్య కొందరు విమర్శ శేఖరులు బయలుదేరి షేక్స్పియరు అసలు నాటకములనే రచింపలేదని వాదించి, నిరూపించుటకు ప్రయత్నించి, చల్లబడినారు. (2) మన దేశమున కవి సమ్రాట్టు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని అనుకరించుచు రచనలను వెలయించుచున్న వారెందరో కన్పట్టుచున్నారు. అందులో మరీ కొందరి రచనలు విశ్వనాథవారి రచనలవలెనే కన్పట్టుచుండును, దానిని బట్టి "ఆ రచనలు మావే నరోయ్" అని ఆ రచయితలు కంఠోక్తిగా చెప్పుకొనుచున్నను, వానిలో నా ప్రవేశము కాని, నా కరకౌశలము కాని లేదు" అని విశ్వనాథవారు స్పష్టముగా ప్రకటించుచున్నను "కాదు, మీకు తెలియదులే."

అవి విశ్వనాథ వ్రాసినవే" అని గట్టిగా నమ్మువారు నేడు కలరు. ఇట్టిదే శ్రీనాథుని క్రీడాభిరామ కర్తృత్వ విషయమనియు నేను విశ్వసించుచున్నాను.

ఏదేని ఒకవిషయమును నిర్ధరించుటకు గ్రంథస్థాధారము ప్రబలలో ప్రమాణము కావలయును. అందు సుస్పష్టముగా, నిస్సందేహముగా చెప్పబడి యుండుటచే వల్లభరాయడే క్రీడాభిరామమును రచించియుండునని నేను నమ్ముచున్నాను. పోతే, క్రీడాభిరామ రచనలో శ్రీనాథుడు కొంత సాహాయ్యముచేసి ఉండవచ్చును. ఆ సాహాయ్యము కూడ ఆదరపూర్వకమును, అభిమాన ప్రేరకమును అయి ఉండునని చెప్పుట అసమంజసము కాజాలదు. వల్లభరాయ - శ్రీనాథులు సమవయస్కులైనను కాకున్నను ఇందుల కెట్టి అభ్యంతరమును ఉండదు.

తెలిసినంతలో, ప్రాచీనకాలమందు, వల్లభామాత్యుడే ప్రథమాంధ్ర నాటక కర్త అగుచున్నాడు.

పుస్తకపరిచయం :

# రెండు ఏకాంకికలు

రచయిత :
నూకల సత్యనా

ప్రతులకు :
రచయిత
మదరసే అయిజా హైస్కూలు
మలకపేట - హైదరాబాదు

రంగస్థలంమీద ప్రదర్శించడానికి అనువుగా ఉన్నాయి. ఈ సంపుటిలోని రెండు నాటికలు. మొదటిది, 'ఒకేజన్మలో మూడవతారాలు.' రెండవది 'ఎత్తుకు పైఎత్తు' లేక 'ఇల్లాలినొల్లని వల్లభుడు.' ఏకాంకికలలో సంభాషణ బిగువు అంతగా లేకున్నా ఓ మోస్తరుగా వుంది. 'ఎత్తుకు పైఎత్తు' లో తెలంగాణా జానపదుల భాషను ఉపయోగించినారు. నాటికల యితివృత్తం పాతదే అయినప్పటికీ చిత్రీకరణలో కొంత కొత్తదనం కనిపిస్తుంది. రెండు ఏకాంకికలను సులభంగా ప్రదర్శించవచ్చును.

—గూడూరి సీతారాం.

# స్రవంతిలో ప్రచురింపబడిన రచనలు

## 1958 ఏప్రియల్ నుండి 1959 మార్చి వరకు

వ్యాసములు

1. ప్రథమాంధ్రనాటకకర్తలు- శ్రీ కోదండ రామచంద్రశాస్త్రి — శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు, ఎం. ఏ.
2. తాళ్ళపాకవారి వేంకటేశ్వర వచనాలు — శ్రీ వేటూరి ఆనందమూర్తి
3. రాయవాచకము (ప్రాచీనాంధ్ర వచన వాఙ్మయము) — డా. బి. రామరాజు
4. ప్రథమాంధ్ర నాటకకర్తలు- శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులు — శ్రీ పోణంగి శ్రీరామఅప్పారావు ఎం.ఏ
5. శ్రీ పరవస్తు వెంకటరంగాచార్యులు
6. నేటి కవిత -కృష్ణశాస్త్రి- — శ్రీ వేటూరి ఆనందమూర్తి
7. కుశవంశ వృత్తాంత కథనము — శ్రీ గాండీవి
8. ప్రథమాంధ్ర నాటకకర్తలు- శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి — శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు
9. నేటి కవిత -కృష్ణశాస్త్రి-2 — శ్రీ వేటూరి ఆనందమూర్తి
10. కాశీఖండ విమర్శనము — శ్రీ గాండీవి
11. జానపద కళా సంపద -కపిలె పాటలు — శ్రీ తూమాటి దొణప్ప, బి. ఏ. ఆనర్స్
12. ప్రథమాంధ్ర నాటకకర్తలు- శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు — శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు
13. ప్ర. నా. కర్తలు -శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి — ,, ,, ,,
14. జానపద కళా సంపద -విసరురాతి పాటలు — శ్రీ తూమాటి దొణప్ప
15. నేటి కవిత -కృష్ణశాస్త్రి-3 — శ్రీ వేటూరి ఆనందమూర్తి
16. జానపద కళాసంపద-కలుపు పాటలు — శ్రీ తూమాటి దొణప్ప

17. నవరచయితలూ- యువరచయితలూ శ్రీ తిరుమల రామచంద్ర
విద్వత్కవి విశ్వం-1
18. కాశీఖండ విమర్శనము శ్రీ గాండీవి
19. శ్రీమద్రామాయణ కల్పవృక్షము శ్రీ సంపత్కుమార్
(తులనాత్మక పరిశీలన)
20. విద్వత్కవి విశ్వం-2 శ్రీ తిరుమల రామచంద్ర
21. విశ్వనాథవారి నవలలు - వాని శ్రీ జువ్వాడి గౌతమరావు
వైశిష్ట్యము
22. జానపద కళా సంపద-జెట్టిజాము శ్రీ తూమాటి దోణప్ప
పాటలు
23. పాశ్చాత్యుల ఆంధ్ర భాషా సేవ-1 డా. కొత్తపల్లి వీరభద్రరావు
24. విశ్వనాథవారి రూపక పరిశీలనము శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు
25. పాశ్చాత్యుల ఆంధ్ర భాషా సేవ-2 డా. కొత్తపల్లి వీరభద్రరావు
26. విశ్వనాథవారి లఘుకావ్యాలు శ్రీ వేటూరి ఆనందమూర్తి
27. తెలుగు కన్నడ భాషలకు ఏక లిపి
ఆవశ్యకత శ్రీ కె. సుబ్బారామప్ప, ఎం.ఏ., బి.ఇడి.
28. విశ్వనాథవారి నవలలు- శ్రీ నాగభూషణ్
29. ప్రథమాంధ్ర నాటక కర్తలు- శ్రీ పోణంగి శ్రీరామఅప్పారావు,
శ్రీ వల్లభామాత్యుడు ఎం. ఏ.
30. మహాకవి బిహారీ శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

కవితలు :

1. శ్రీకృష్ణాష్టకము శ్రీ బూర్గుల రామకృష్ణరావు
2. సంస్కృతీకరణాలు డా. గిడుగు వేంకట సీతాపతి
3. సాక్షాత్కారము శ్రీ శిష్ట్లా బాలకోటేశ్వరరావు
4. కాముని పున్నమ శ్రీ ఆచి వెంకటాచార్యులు
5. శతపత్త్రిము శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి
6. ఓహో శ్రీ సుప్రసన్న
7. అంజలి శ్రీ వంగల పార్థసారథి ఆచార్య
8. ఆశాకిరణాలు శ్రీ పి. నాగార్జున

| | | |
|---|---|---|
| 9. | పశ్చాత్తాపము | శ్రీ జె. బాపురెడ్డి |
| 10. | కవితాలహరి | శ్రీ వేలమూరి ప్రసాదరావు |
| 11. | అక్కాచెల్లెళ్ళు | శ్రీ అమరేంద్ర |
| 12. | కవితా కుమారి | శ్రీ యలమాటి |
| 13. | రాధ గాథ | శ్రీ ఏ. ఎం. పురుషోత్తమాచార్యులు |
| 14. | కాపుపడతి | శ్రీ వేణుగోపాలాచార్య |
| 15. | సంస్కృతీకరణాలు | శ్రీ గిడుగు వేంకట సీతాపతి |
| 16. | శతపత్త్రిము | శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి |
| 17. | భామినీ విలాసం | శ్రీ శ్రీనివాస సోదరులు |
| 18. | శత పత్త్రము | శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి |
| 19. | లక్ష్యసిద్ధి | శ్రీ కొక్కరగడ్డ శ్రీరామమూర్తి |
| 20. | శత పత్త్రిము | శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి |
| 21. | ,, | ,, |
| 22. | శిథిలాలయము | శ్రీ వంగల పార్థసారథి ఆచార్య |
| 23. | సంస్కృతీకరణాలు | డా. గిడుగు వేంకట సీతాపతి |
| 24. | ధర్మారణ్యము | శ్రీ శనగన నరసింహస్వామి, ఎం.ఏ. |
| 25. | తొలికిరణము | శ్రీ సుప్రసన్న |
| 26. | అభ్యర్థన | శ్రీ ఎన్. టి. పి. రామకృష్ణమాచార్య |
| 27. | శతపత్త్రిము | శ్రీ పై. సుబ్బరామశాస్త్రి |
| 28. | వర్షారజని | శ్రీ శనగన నరసింహస్వామి ఎం. ఏ. |
| 29. | రోచిర్వీచి | శ్రీ సుప్రసన్న |
| 30. | నీరాజనము | శ్రీ వంగల పార్థసారథి ఆచార్య |
| 31. | అవతారము | శ్రీ శనగన నరసింహస్వామి |
| 32. | సాయంసంధ్య | శ్రీ బోయి భీమన్న |
| 33. | అద్వైతము | శ్రీ జె. బాపురెడ్డి |
| 34. | అహర్ముఖం | శ్రీ గాడెపల్లి కుక్కుటేశ్వరరావు |
| 35. | రహస్యము | శ్రీ స్ఫూర్తిశ్రీ |
| 36. | శబ్దబ్రహ్మ | శ్రీ శనగన నరసింహస్వామి ఎం. ఏ. |
| 37. | ఆత్మీయము | శ్రీ సి. నారాయణరెడ్డి |
| 38. | భావస్థిరాణి | శ్రీ సుప్రసన్న |
| 39. | ఒడ్డెవాడు | శ్రీ అందె వెంకటరాజము |

కథానికలు

| | |
|---|---|
| 1. తారుమారు | శ్రీ సేడిది విశ్వనాథం |
| 2. పుష్పించిన జీవితం | శ్రీ జీవన్ |
| 3. మరదలు (నవల) | శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు |
| 4. స్వర్ణసీత | శ్రీ ఆచంట జానకిరామ్ |
| 5. భావజీవితంలో పరిణామం | శ్రీ యం. హీరాలాల్ రాయ్ |
| 6. అచ్చి | శ్రీ ఉప్పు రాఘవేంద్రరావు |
| 7. కీలెరిగిన వాత | శ్రీ పాంచాలి |
| 8. 7953 | డా. జొ. రమాకాంత్ |
| 9. డబ్బు పాపిష్ఠిది | శ్రీ కొండముది హనుమంతరావు |
| 10. గుణపాఠం | శ్రీ యం. హీరాలాల్ రాయ్ |
| 11. ఆదర్శవాది | శ్రీ తెలుగుపాప |
| 12. ప్రణయజీవులు | |
| 13. అమ్మ లేదూ ? | శ్రీ చక్రవర్తి రంగస్వామి |
| 14. సుప్తస్మృతులు | శ్రీ యం. హీరాలాల్ రాయ్ |
| 15. జన్మరహస్యం | |
| 16. ఎందుకు ?...ఎక్కడికి ? (ఊహాచిత్రం) | కుమారి తాతినేని హేమాదేవి |
| 17. కాళిదాసు పునరాగమనం (ఊహారూపకం) | శ్రీ సి. నారాయణరెడ్డి |

నాటికలు

| | |
|---|---|
| 1. దొంగ | డా. జొ. రమాకాంత్ |
| 2. తరంగాలు (శ్రవ్యనాటిక) | శ్రీ భారతి |
| 3. పది నిమిషములు | హిందీ మూలం : శ్రీ రామకుమారశర్మ ఎం. ఏ.<br>అనుసరణ : శ్రీ కొసనం మహేశ్వర రావు |
| 4. ఆగస్టు—15 | శ్రీ జొ. రమాకాంత్ |
| 5. ఏకాంకిక | శ్రీ చంద్రమౌళి |

## గేయములు

| | |
|---|---|
| 1. పుష్పా కాయా ప్రయాణం | శ్రీ శంకర శ్రీరామారావు |
| 2. భ్రమాభ్రమణం | శ్రీ చేరా |
| 3 నిర్వృత్తి | శ్రీ చక్రవర్తి రంగస్వామి |
| 4. ప్రమీల సమరసన్నాహం | హిందీ మూలం: శ్రీ మైథిలీశరణ్ గుప్త<br>అనుసరణ : శ్రీ ఎస్. టి. పి. రామ చంద్రాచార్య |
| 5. సందేవాన | శ్రీ [illegible] |
| 6. తొలకరి | శ్రీ సస్యశ్రీ |
| 7. నీవు కురులు విరియబోస్తే | శ్రీ వజీర్ రహ్మాన్ |
| 8. రాగిచెట్టు | శ్రీ రసగ్రాహి |
| 9. మహోదయం | శ్రీ పేర్వారం జగన్నాథం |
| 10. ఓ మహాకవి కాళిదాసా | శ్రీ ఉండేల మాలకొండారెడ్డి |
| 11. మహాకవీ ! జోహారు | శ్రీ సురభి నరసింహము |



# దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

## 959 ఖైరతాబాదు - హైదరాబాదు

# వార్షిక నివేదిక

దక్షిణభారత హిందీప్రచారసభ - ఆంధ్ర 23వ వార్షిక నివేదికను ఆంధ్రమహాజనులకు అందజేయుటకు సంతోషించుచున్నాము.

1. **శ్రద్ధాంజలి :** నివేదిక సంవత్సరమున సుప్రసిద్ధ దేశభక్తులును, హిందీ భాషాభిమానులును అగు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు కీర్తిశేషులయినారని తెలియజేయుటకు విచారించుచున్నాము. వారి ఆత్మకు శాంతిని చేకూర్చవలసినదిగా భగవంతుని ప్రార్థించుచున్నాము.

2. **కార్యాలయ భవనము :** ఈ సంవత్సరము దక్షిణభారత హిందీప్రచార సభ - ఆంధ్ర కార్యాలయమునకై ఖైరతాబాద్‌లో రు. 55 వేలకు ఒక భవనము కొనబడినది. అందు ప్రెస్ మొదలగువానికొరకై మరి రు. 15,000 లు ఖర్చుతో క్రొత్త నిర్మాణము చేయబడినది.

3. **కార్యదర్శి :** దక్షిణభారత హిందీప్రచారసభ, మద్రాసువారు హిందీ ప్రచార కార్యమును అభివృద్ధిపరచుటకై యీ సంవత్సరము ఒక ప్రత్యేక ప్రణాళికను రూపొందించియున్నారు. ఆ ప్రణాళిక ప్రకారము చిరకాలము నుండి ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘమునకు కార్యదర్శిగా నుండి సమర్థతతో హిందీ ప్రచారాభివృద్ధికి తోడ్పడిన శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు కేంద్రసభకు సంయుక్తకార్యదర్శిగా నియమింపబడినారు. వారి కార్యాలయము హైదరాబాదులోనే ఉన్నది. వారు ఆంధ్ర కర్ణాటక ప్రాంతములలో హిందీప్రచారాభివృద్ధికి కృషిచేయుచున్నారు. వారి స్థానములో యిదివరలో హైదరాబాద్ హిందీప్రచార సంఘమునకు కార్యదర్శిగానుండిన శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారు ది. 1-3-1958 నుండి కార్యదర్శిగా నియమింపబడినారు.

4. **సభ్యులు :** ఈ సంవత్సరం రు. 250 లు యిచ్చిన యావజ్జీవిత సభ్యులు ఒకరు, సంవత్సరమునకు పదిరూపాయల సభ్యత్వ రుసుమును చెల్లించు వార్షిక సభ్యులు 320, హిందీ ప్రేమీమండలుల పక్షమున ప్రతినిధి సభ్యులుగా వచ్చు సభ్యులు 217 ఉన్నారు.

5. **కార్యవర్గ సమావేశములు :** ఈ సంవత్సరం 5 సార్లు సభ కార్యవర్గ సమావేశములు జరిగి అందు హిందీప్రచారాభివృద్ధికి అవసరమైన పలుతీర్మానములు చేయబడినవి.

6. **సర్వసభ్య సమావేశము :** ది. 25-3-58 న సర్వసభ్యసమావేశము సభాధ్యక్షులు డా. బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతను జరిగినది. ఆ సమావేశమునందు 1958 వ సంవత్సరమునకు ఆదాయ వ్యయ అంచనా పట్టిక అంగీకరింపబడినది. 1956 వ సంవత్సరపు ఆడిట్ చేయబడిన లెక్కలు ఆమోదింపబడినవి. అదే సందర్భమున కేంద్ర ప్రభుత్వపు ఆర్థిక పౌరవ్యయ మంత్రిగా నియమింపబడిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి గౌరవార్థం సన్మానసభ జరిగినది.

7. **విద్యాలయములు :** ఈ సంవత్సరము సభ పక్షమున పది హిందీ మహా విద్యాలయములు నడుపుటకు నిశ్చయించబడినది. విద్యాలయముల కొరకై ఒక ప్రత్యేక ప్రణాళిక రూపొందించబడినది. ఈ ప్రణాళిక ప్రకారం విజయవాడ, రాజమండ్రి, విజయనగరం, ఏలూరు, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, హైదరాబాద్ పట్టణములలో విద్యాలయములు ప్రారంభించబడినవి. ఏలూరు, గుంటూరు విద్యాలయములు తప్ప తక్కిన విద్యాలయములన్నియు చాల జయప్రదముగా నడుచుచున్నవని తెలియజేయుటకు సంతోషించుచున్నాము. ఈ విద్యాలయములలో గుంటూరు, ఏలూరు, నెల్లూరు, కడప, హైదరాబాదు విద్యాలయములకు మన సభ పక్షమున నెల ఒకటికి నూరు రూపాయలు గ్రాంటుగా యివ్వబడుచున్నవి.

విజయనగరం, రాజమండ్రి, విజయవాడ, చిత్తూరు, అనంతపురం విద్యాలయములను గత సంవత్సరము వలెనే యీ సంవత్సరం కూడ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు తమ హిందీ ప్రణాళిక క్రింద అంగీకరించినారు. ఆ విద్యాలయములకు ప్రభుత్వ పక్షమున ఆర్థిక సహాయము లభించగలదు.

8. **హిందీప్రేమీ మండలులు :** నివేదిక సంవత్సరమున మొత్తం 90 హిందీప్రేమీ మండలులు సభకు అనుబంధ సంస్థలుగా పనిచేయుచున్నవి. ఈ మండలులు చేయుచున్న కృషి చాల ప్రసంశనీయమైనది.

వీనిలో 44 హిందీప్రేమీ మండులులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు నెల ఒకటికి రు. 85 ల చొప్పున 1958 అక్టోబరునుండి 1959 మార్చి నెలాఖరు వరకు ఆర్థిక సహాయము చేయుటకు అంగీకరించినారు. మొత్తము ఖర్చులో

నూటికి యిరువదిమూడువంతుల ఖర్చును సభ భరించుచున్నది. ఉత్సాహముతో హిందీప్రేమీ మండలులకు సహాయముచేయ బూనుకొన్న ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారికి మా హృదయపూర్వక అభివందనములను తెలియజేయు చున్నాము.

పై ప్రభుత్వ ప్రణాళికలోని మండలులే కాక మిగిలిన మండలులలోని 10 హిందీప్రేమీ మండలులకు వారు తయారుచేయుచున్న విద్యార్థులననుసరించి పరీక్షా గ్రాంటుగాని లేక నెల ఒకటికి రు. 10 లు చొప్పున వర్గ సంచాలన గ్రాంటుగాని సభతరఫున యివ్వబడుచున్నది.

9. వైతనిక ప్రచారకులు: ఈ సంవత్సరమున సభ పక్షమున పూర్తి సమయము వినియోగించు 14 మంది వైతనిక ప్రచారకులు వివిధ కేంద్రములలో పనిచేయుచున్నారు.

10. సహాయక ప్రచారకులు: ఈ సంవత్సరము హిందీ వ్యాప్తికై కొంత కాలము మాత్రము వినియోగించు మొత్తం 24 మంది సహాయక ప్రచారకులు ఆ యా సమయములలో సభ పక్షమున నియమింపబడినారు. వారికి నెల ఒకటికి పది రూపాయల చొప్పున సభ పక్షమున ఆర్థిక సహాయము చేయబడుచున్నది.

11. స్వతంత్ర ప్రచారకులు: ఈ సంవత్సరం 214 గురు స్వతంత్ర హిందీ ప్రచారకులు వివిధ కేంద్రములలో హిందీ తరగతులను నడిపించుచు సభ పరీక్షలకు విద్యార్థులను తయారుచేయుచున్నారు. వారు పరీక్షలకు పంపు విద్యార్థుల సంఖ్య ననుసరించి వారికి సంవత్సరమున కొకసారి పరీక్షా గ్రాంటు యివ్వబడు చున్నది. ఈ సంవత్సరం రు. 6,038,82 ల పరీక్షా గ్రాంటు యివ్వబడుచున్నది

12. పరీక్షలు: దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు వారు ప్రారంభిక పరీక్షలు, ఉన్నత పరీక్షలు అని రెండు విభాగములుగా పరీక్షలను నడుపుచున్నారు. ఉన్నత పరీక్షలను కేంద్ర సభవారే నడుపుచూ ప్రారంభిక పరీక్షలను నడుపు బాధ్యతను యిదివరలోనే యీ సభకు అప్పగించియున్నారు. ఈ సంవత్సరం 426 కేంద్రములలో మొత్తం 25,571 మంది విద్యార్థులు ప్రారంభిక పరీక్షలకు అనగా ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలకు హాజరైరి. గత సంవత్సరంకంటె యీ సంవత్సరం 35 పరీక్షా కేంద్రములు, 2,863 పరీక్షార్థులు పెరిగినారని తెలియజేయుటకు సంతోషించుచున్నాము.

ఈ సంవత్సరం ఉన్నత పరీక్షలకు అనగా ప్రవేశిక, విశారద పూర్వార్థ, ఉత్తరార్థ, ప్రవీణ పరీక్షలకు ఆంధ్ర దేశమున మొత్తం 5,110 పరీక్షార్థులు

హాజరైనారు. గత సంవత్సరములకంటె యీ సంవత్సరం ఉన్నత పరీక్షార్థుల సంఖ్య 1460 పెరిగినదని తెలియజేయుటకు సంతోషించుచున్నాము.

13. **హిందీ ప్రచారకస్వాధ్యాయ శిక్షణ శిబిరములు :** హిందీ కార్యకర్తల జ్ఞానాభివృద్ధికి నివేదిక సంవత్సరమున ఆదవాని, మదనపల్లి, నెల్లూరు, మచిలీపట్టణము కేంద్రములలో హిందీ ప్రచారకస్వాధ్యాయ శిక్షణ శిబిరములు జరిగినవి. సుమారు 125 ప్రచారకులు ఆ శిబిరములలో పాల్గొని వివిధ విషయములపై చర్చించిరి.

15. **మండల సంఘటకులు :** హిందీ ప్రచారమును విరివిగాను, పటిష్ఠముగాను కొనసాగించుటకై మొత్తము ఆంధ్ర ప్రదేశ్ 5 మండలములుగా విభజింపబడినది.

(1) పూర్వాంధ్ర మండలము : శ్రీకాకుళం, విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలు.

(2) మధ్యాంధ్ర మండలము : పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, ఖమ్మంమెట్టు జిల్లాలు.

(3) దక్షిణాంధ్ర మండలము : నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం జిల్లాలు.

(4) పశ్చిమాంధ్ర మండలము : కర్నూలు, మహబూబ్‌నగర్, నల్లగొండ హైదరాబాదు జిల్లాలు.

(5) ఉత్తరాంధ్ర మండలము: మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాలు.

ప్రస్తుతము అనుభవజ్ఞులైన ముగ్గురు సభ కార్యకర్తలు మండల సంఘటకులుగా నియమింపబడి కడు సమర్థతతో ఆయా మండలములలో హిందీ ప్రచారాభివృద్ధికి కృషిచేయుచున్నారు. శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణ శర్మగారు పూర్వాంధ్ర మండల సంఘటకులుగాను, శ్రీ నండూరి శోభనాద్రాచార్యులుగారు మధ్యాంధ్రమండల సంఘటకులకు సహాయకులుగాను, శ్రీ చంద్రభట్ల అప్పన్నశాస్త్రిగారు దక్షిణాంధ్రమండల సంఘటకులుగాను, సేవ చేయుచున్నారు. వారు యీ సంవత్సరం 261 మందిని సభకు వార్షిక సభ్యులుగాను, సుమారు 200 మందిని సభ తెలుగు సాహిత్య మాస పత్రిక సవం చందాదారులుగాను చేర్పించినారు.

15. మండల హిందీ మహాసభలు: ఈ సంవత్సరం అక్టోబరు 20, 21 తేదీలలో దక్షిణాంధ్ర మండల హిందీ మహాసభలు మదనపల్లిలో శ్రీ స్వామి రామానందతీర్థగారి అధ్యక్షతను జయప్రదంగా జరిగెను. దక్షిణభారత హిందీ ప్రచార సభ కార్యాధ్యక్షులు శ్రీ డి. శ్రీనివాసయ్యంగార్ మహా సభలను ప్రారంభించిరి. అదే సందర్భమున చిత్తూరుజిల్లా హిందీ ప్రచారక సమ్మేళనము శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారి అధ్యక్షతను జరిగినది. ఆంధ్ర ప్రభుత్వ హిందీ ఎడ్యుకేషన్ ఆఫీసర్ డాక్టర్ ఇలపావులూరి పాండురంగారావుగారు ఆ సమ్మేళనమును ప్రారంభించిరి.

డిసెంబరు 13, 14 తేదీలలో మధ్యాంధ్రమండల హిందీమహాసభలు మచిలీపట్టణములో శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారి అధ్యక్షతను జరిగెను. సభలను శ్రీ కొడాలి అంజనేయులుగారు ప్రారంభించిరి. పలువురు పెద్దలు ఉపన్యసించిన పిదప ముఖ్యములగు తీర్మానములు చేయబడినవి.

16. ఆంధ్రహిందీప్రచార చరిత్ర : ఆంధ్ర హిందీ ప్రచారచరిత్ర ముద్రణ యీ సంవత్సరాంతమునకు పూర్తి అయినది. ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘమువారు సాధించిన మహాత్కార్యములలో యిది ఒకటి అని చెప్పవచ్చును చరిత్ర చక్కని గ్లేజు కాగితముపై 630 పేజీలలో సుమారు 750 చిత్రములతో చక్కగా ముద్రింపబడినది.

17. ప్రచురణలు : సభపక్షమున యీ సంవత్సరం వ్యాస రత్నావళి, నెహ్రూ చరిత్ర అను రెండు తెలుగుపుస్తకములు ప్రచురింప బడినవి.

సుప్రసిద్ధ నిర్మాణ కార్యకర్తలగు శ్రీ కొమండూరి శఠకోపంగారు చాలా శ్రమపడి నెహ్రూ చరిత్రను వ్రాసియిచ్చినారు. వారికి సభ తరఫున ధన్యవాదము లర్పించుచున్నాము.

18. స్రవంతి : సభ తరఫున ప్రకటింపబడుచున్న తెలుగు సాహిత్య మాస పత్రిక స్రవంతి యీ సంవత్సరముగూడ చాల జయప్రదముగా ఆంధ్ర ప్రజల ఆదరాభిమానములను చూరగొన్నదని తెలియజేయుటకు సంతోషించు చున్నాము. ఉత్తమమైన అనేక సాహిత్య వ్యాసములు పత్రికలో ప్రకటింప బడినవి. పత్రికకు ఆంధ్రదేశమందలి కొద్ది ఉత్తమ సాహిత్య పత్రికలలో స్థానము లభించినది. అట్టి వ్యాసములను వ్రాసి పంపి పత్రికను ఆదరించిన ఆయా సాహిత్యకులకు సభ తరఫున కృతజ్ఞతాంజలులు సమర్పించుచున్నాము.

19. సాంస్కృతిక కార్యక్రమము : ది. 21-9-58 న సభ కార్యాలయ భవనంలో తెలంగాణా మహాకవి శ్రీ దాశరథిగారి అధ్యక్షతను పంచభాషా కవి సమ్మేళనము జరిగినది. తెలుగు, ఉర్దూ, హిందీ, కన్నడం, మరాఠీ భాషల ప్రముఖ కవులు పెక్కుమంది పాల్గొని సమ్మేళనము చాల జయప్రదం చేశారు. 21-12-58 తేదీన సభ సాంస్కృతిక శాఖ "నాట్యకళాసంగమ్" తరఫున పద్మశ్రీ స్థానం నరసింహారావుగారి అధ్యక్షతను హైదాబాద్‌లో "కళాకారులు" అను తెలుగు నాటిక "దస్ మినిట్" అను హిందీ నాటిక ప్రదర్శించబడినది.

20. గ్రంథాలయము : హైదరాబాద్‌లోని సభ తాలూకు కేంద్ర హిందీ గ్రంథాలయంలో మొత్తం 2,334 పుస్తకాలు, హిందీ, తెలుగు, ఇంగ్లీషు భాషలలో ఉన్నవి. ఈ సంవత్సరం కేంద్రసభ నుండి రు. 250 లు విలువచేసే పుస్తకములు, మన సభనుండి రు. 500 లు విలుచేసే క్రొత్త హిందీ పుస్తకములు గ్రంథాలయంలో చేర్చబడినవి. సైకిల్ వ్యాన్‌ద్వారా ఇండ్లకుకూడా పుస్తకములు అందించే ఏర్పాటు చేయబడినది. గ్రంథాలయమునకు 43 పత్రికలు వివిధ భాషలలో వచ్చుచున్నవి.

విజయవాడ బ్రాంచి కార్యాలయములో గల గ్రంథాలయములో 2,055 పుస్తకము లున్నవి.

21. కార్యాలయం : నివేదిక సంవత్సరాంతమునకు సభయొక్క మొత్తం కార్యకర్తలు 46. అందు హైదరాబాదు కార్యాలయంలో మొత్తం 18 మంది కార్యకర్తలు, విజయవాడ కార్యాలయములో 11 గురు కార్యకర్తలు పని చేయున్నారు. సంఘటకులుగా ముగ్గురు, వైతనిక ప్రచారకులుగా 14 గురు పనిచేయుచున్నారు.

ఇదివరలో కార్యదర్శి, జనరల్ మేనేజరు యీ యిరువురు మాత్రము అన్ని విభాగములను నిర్వహించు బాధ్యతకలిగి యుండెడివారు. ఈసంవత్సరం మార్చి 9 వ తేదీవరకు శ్రీ దశిక సూర్యప్రకాశరావుగారు జనరల్ మేనేజరుగా ఉండెడివారు. ప్రస్తుతం వారు కంట్రాక్టుపద్ధతిపై సాహిత్య విభాగమును చూచుటకు నియమింపబడినారు. శ్రీ సూర్యప్రకాశరావుగారు రిటైరు అయి కందున మార్చి 10 వ తేదీనుండి శ్రీ తాడిగడప మార్కండేశ్వరరావుగారు తాత్కాలికముగా జనరల్ మేనేజరుగా పనిచేసినారు. ఆ తరువాత ది. 25-5-58న జరిగిన సభ కార్యవర్గసమావేశపు నిర్ణయానుసారముగా యీ దిగువ కార్యకర్తలు ఆ యీ విభాగములకు వ్యవసాపకులుగా నియమింపబడినారు.

1. శ్రీ తాడిగడప మార్కండేశ్వరరావుగారు - జనరల్ విభాగము 2. శ్రీ అడవి శ్రీకృష్ణమూర్తిగారు-విజయవాడ కార్యాలయము 3. శ్రీ అట్లూరి రామారావుగారు - పరీక్షా విభాగం. 4. శ్రీ కొల్లిపర సౌభాగ్యరావుగారు - అర్థవిభాగం. శ్రీ చి. వేం. సుబ్రహ్మణ్యంగారు జనరల్ విభాగ మేనేజరుకు సహాయకులుగా నియమింపబడిరి. ఈ సంవత్సరం హైదరాబాద్ కార్యాలయములో రు. 25,326.97 ల పుస్తకములు అమ్మబడినవి.

విజయవాడ కార్యాలయ వ్యవస్థాపకుని ఆధీనములో పుస్తకవిక్రయశాల, ఆంధ్ర హిందీప్రచార ప్రెస్ నడుచుచున్నవి. అచటి పుస్తక విక్రయశాలలో రు. 22,104.25 ల పుస్తకములు అమ్మబడినవి. ఆంధ్ర హిందీప్రచార్ ప్రెస్‌లో తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలలో అచ్చుపని జరుగుచున్నది.

22. ప్రభుత్వము: తెలంగాణములో మొదటినుండియు హెచ్. ఎస్. సి. పరీక్షలలో హిందీ నిర్బంధ పఠనీయవిషయంగా బోధింపబడుచునే ఉన్నది. ఆంధ్రప్రాంతములోకూడ ఈ సంవత్సరం ఎస్. ఎస్. ఎల్. సి. లో హిందీ నిర్బంధ పఠనీయ విషయంగా చేర్చబడినది. పరీక్షలలో హిందీలో కనీసం నూటికి 15 మార్కులు రావలెనని నిర్ణయము చేయబడినది. అందుకు ఆంధ్రప్రభుత్వము వారు అభినందనీయులు. ప్రస్తుతం స్కూళ్ళలో వారమునకు రెండు పీరియడ్లు మాత్రమే హిందీబోధనకు ఏర్పాటు చేయబడినవి. వాటిని కనీసం నాలుగు వరకయినా పెంచడము చాల అవసరమని మా అభిప్రాయము. అందుకు ప్రభుత్వమువారు తగు ఏర్పాటు చేయగలరని విశ్వసించుచున్నాము.

ఆంధ్రప్రభుత్వమువారు హిందీ ఎడ్యుకేషన్ ఆఫీసరు అను పేరుతో హిందీకొరకై ఒక ప్రత్యేకోద్యోగిని నియమించి సభ యాజమాన్యమున 44 హిందీప్రేమీ మండలులకు, 5 విద్యాలయములకు ఆర్థిక సహాయముచేయుటయే గాక, రాజమండ్రి, కర్నూలు పట్టణములలో హిందీ సెమినారులు నడిపి హిందీ ప్రచారాభివృద్ధికి తోడ్పడుచున్నందుకు అభినందనీయులు.

23. ఈ సంవత్సరం హిందీప్రచార కార్యములలో మాకు అన్ని విధముల తోడ్పడి మా కార్యక్రమమును జయప్రదమొనర్చిన సభలు కార్యవర్గ సభ్యులు, సాధారణ సభ్యులు, ప్రేమీమండలి సభ్యులు, ప్రచారకులు, ఆంధ్రప్రభుత్వపు విద్యాశాఖాధికారులకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

హైదరాబాదు, వేమూరి ఆంజనేయశర్మ
17-1-'59 కార్యదర్శి

## గ్రంథ స్వీకారము :

| | | |
|---|---|---|
| ౧. విజ్ఞాన వ్యాసములు | .... | శ్రీ కె. ఎస్. వి. గోపాలమూర్తి |
| ౨. వ్యాస శాకుంతలం | .... | పురాణపండ రామమూర్తి |
| ౩. భగవద్గీతా దివ్య ప్రభ | .... | తిరుక్కోవలూరు మహాస్వాములు |
| ౪. హ్రీంకార శతకము | .... | శిరోమణి నూకల సత్యనారాయణ |
| ౫. తేజశ్చక్రము | .... | సుప్రసన్న |
| ౬. ఆనందచేతన | .... | కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి |
| ౭. సింహబలి | .... | మోటూరి వేంకటరావు |
| ౮. తెలుగుతల్లి | .... | మంటిమడ్డి శేషశర్మ |
| ౯. గాంధీ శతకము | .... | నరగం కృష్ణమూర్తి, కె. హనుమ్మాడ్జి రావు శంభూకారి |
| ౧౦. సోవియట్ దేశంలో వ్యవసాయ సమస్య పరిష్కరింపబడిన విధం | .... | డి. యస్. కోల్బోకోవ్ |
| ౧౧. దీనవీణ | .... | వేలేటి అంబదాస్‌శర్మ |
| ౧౨. శారదా విలాసము | .... | వి. వేంకట హనుమంతరావు |
| ౧౩. మాధురీ విలాసము | .... | వి. వేంకట హనుమంతరావు |
| ౧౪. మహారాణా బాప్పా; దేశాయి | | సదాశివరావు |
| ౧౫. శివానందలహరి | .... | రోహిణి |

సమీక్ష కొఱకు పంపువారు ప్రతి పుస్తకమునకు దయచేసి రెండేసి ప్రతులను పంపగోరెదము.

సంపాదకుడు

Statement about ownership and other particulars about newspaper (SRAVANTI) as required under rule 8 of the Registration of Newspapers.

## FORM IV

| | | |
|---|---|---|
| 1. Place of publication | ... | 6—2—959, Khairatabad, Hyderabad—4. |
| 2. Periodicity of its Publication | ... | Monthly. |
| 3. Printer's Name | ... | V. Anjaneya Sarma. |
| Nationalily | ... | Hindu. |
| Address | ... | 959, Khairatabad, Hyderabad-4. |
| 4. Publisher's Name | ... | V. Anjaneya Sarma. |
| Nationality | ... | Hindu. |
| Address | ... | 959, Khairatabad, Hyderabad-4. |
| 5. Editor's Name | ... | V. Anjaneya Sarma & C. Narayana Reddy. |
| Nationality | ... | Hindu. |
| Address | ... | 6—2—959, Khairatabad, Hyderabad-4. |
| 6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | | Dakshina Bharath Hindi Prachar Sabha-Andhra. 6—2—959, Khairatabad, Hyderabad. |

I, V. Anjaneya Sarma, hereby declare that the particulars given above are true to the best of knowledge and belief.

D/25—2—1959.

(Sd.) V. ANJANEYA SARMA
Signature of Publisher.

# హోమ్ సినిమా ప్రొజెక్టర్

మీ ఇంటి వద్దనే చేత్తో మోసుకొని వెళ్ళడానికి వీలయిన ఈ పోర్టబుల్ ప్రొజెక్టర్‌తో సినిమాను చూసి ఆనందించండి.



టార్చి లేక విద్యుచ్ఛక్తితో దీన్ని పనిచేయించవచ్చు. మామూలు 35 మి. మీ. ఫిలిమ్‌ను ఇందులో ఉపయోగించవచ్చు. 4'×4' పూర్తి సైజులో తెరమీద వర్ణచిత్రాలు, సంఘటనలు, నృత్యాలు వాటంతటవే చలిస్తూఉంటాయి. 10 అడుగుల ఫిలిమ్, నడిపే విధానం, సచిత్రంగా తెలిపే కరపత్రం ఉచితం. స్పెషల్ డీలక్సు రకం రు. 15-50. వి. పి. చార్జీలు రు. 4-50. అదనపు ఫిలిమ్ గజానికి 0-50 నయాపైసలు. రిఫైన్డ్ స్క్రీన్ రూ. 3.

## (డీలక్సు) ఆటోమేటిక్ యాభై గుండ్ల పిస్టల్
## (లైసెన్సు అక్కరలేదు)

ఆటోమేటిక్ యాభై గుండ్ల రిపీటెడ్ డయల్‌తో అమర్చబడిన ఈ అమెరికన్ పిస్టలు పెద్ద ధ్వని, మంటలు కల్గించి దోపిడిగాళ్ళనూ, అడవి మృగాలనూ పారద్రోలుతుంది. సినిమా, డ్రామా నటులకు చాలాఅవసరం శత్రువుల బారి నుండి రక్షించటంలో గొప్ప సహాయకారి. ఖరీదు రు. 10-50. వి. పి. చార్జీలు




రు. 2-50. 25 గుండ్లు ఉచితం. అదనపు గుండ్లు డజన్ రు. 1. మేలైన పిస్టల్ కేసు ఒక్కొక్కటి రు. 3-00. రిపేరుచేయటానికి ఫ్యూయల్ ఆయిల్ రు. 1.

సాంకేతిక పుస్తకాలు : మీకు సంపూర్ణ సంతృప్తిని ఇచ్చే హామీ ఇవ్వగలం

ఎలక్ట్రిక్ అండ్ రేడియో గైడ్ : రు. 15 లతో మీరు స్వయంగా రేడియోను తయారుచేసుకోండి. రేడియో రిపేరీ, వైరింగ్, విద్యుచ్ఛక్తికి సంబంధించిన సమస్తమూ 117 బొమ్మలతో బోధించే ఈ సరికొత్త ప్రచురణ వెల రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

భాషా బోధిని : జాపనీస్, చైనీస్, తమిళం, మలయాళం, బెంగాలీ, జర్మనీ ఇత్యాది దేశ విదేశ భాషలు నేర్పించే ఈ పుస్తకం ఖరీదు రు. 5. వి. పి. చార్జీలు రు. 1.

దర్జీపని కట్టింగ్ రు. 4. సబ్బుల తయారీ రు. 3. ఫోటోగ్రఫీకళ రు. 3. సుహాసనవస్తువుల తయారీ రు. 1-50. ఒకనెలలోనే హిందీ నేర్చుకోండి రు. 4.

1 నుండి 3 పుస్తకాలవరకు వి.పి. చార్జీలు రు. 1-25] [ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే

**Globe - Traders (S. H. 110) Aligarh (INDIA)**